# భీమసేన

# BHIMA

## STORIES
FROM
## BHARATAM
IN
## TELUGU

**Approved by the text Book Committe**

**M. SITARAMA RAO**, B.A., L.T

 [PRICE

# మానవ భూగోళ శాస్త్రము.

గ్రంథకర్త: ముడియం సీతారామరావుగారు.

4, 5, 6 ఫారములకు క్రొత్త సిలబసుప్రకారముపయుక్తమగు
నటుల ముఖ్యవిషయముల నేర్పఱచి అనేక ప్రతిమలంజేర్చి
రెండు భాగములుగా పెద్దక్షరములతో ముద్రింపఁ
బడి యున్నది. అప్రూవయినది.

1-వ భాగము వెల 0-14-0

2-వ భాగము వెల 0-14-0

FOR FORMS IV, V & VI.

REVISED EDITION OF

# A Manual of Human Geography

(In English) Cloth Bound, Price Rs. 1-10-0 Nett.

BY

**Mr. M. SITARAMA RAO**, B. A., L. T.,
Headmaster, Board High School,
CHITTOOR.

APPROVED FOR SCHOOL USE.

Vide page 668, Fort St. George Gazette, dated 10-11-1933.

PUBLISHERS:
Ramachandra Book Depot, Chittoor.

రామచంద్ర గ్రంథమాల.

# భీముఁడు

ఇది

రాజమహేంద్రవరము వీరేశలింగము హైస్కూలునందుఁ

జాలకాలము ప్రధానోపాధ్యాయులుగా నుండిన

ముసియాం-సీతారామరావు, బి. ఏ., ఎల్. టీ. గారిచే

ర చి యిం పఁ బ డి న ది.

APPROVED FOR SCHOOL USE,
PAGE 8, FORT SAINT GEORGE GAZETTE.
2—6—1917.



**RAMACHANDRA BOOK DEPOT.**
**CHITTOOR.**

 [వెల 0-5-0

# పీఠిక.

ఈ చిన్న పుస్తకమునఁ బద్యములుండుట మంచిదని నామిత్రులలోఁ గొందఱనిరి. అందుచేతఁ గొన్నిఁటి నిటఁబొందు పఱచితిని. ఈ పద్యములన్నియుఁ జదువఁదగిన వగుటచేత వానిని బదవిభాగ దండాన్వయసహితముగాఁ జదివించి, పిదప వానిని వల్లెవేయించిన బాగుగానుండునని నా యభిప్రాయము. ఏ కారణముచేతనైనను కష్టమని తోఁచినయెడల వానిని వదలివేయవచ్చును. కథనడక కేయిబ్బందియు నుండదు.

రాజమండ్రి,
1—8—19.

ఇట్లు బుధవిధేయుఁడు,
ముడియం సీతారామరావు.

ఓం.

# భీముఁడు

## 1. భీముని పుట్టుక—బాల్య క్రీడలు.

మహాభారతయుద్ధంబునందు జయముగాంచి, మిక్కిలి ప్రసిద్ధిఁ బొందిన శూరులు పాండవులు. వీరయిదుగు రన్నదమ్ములు. వీరిలో మిక్కిలి బలపరాక్రమసంపన్నుండును, మల్లయుద్ధమునందు సాటిలేని మేటి యని కీర్తిఁ బొందినవాఁడును నగు భీముఁడు రెండవవాఁడు. ఇతఁడు వాయుదేవువరమునఁ గుంతికిఁ బుట్టినవాఁడు గనుక, ఇతనికి వాయుపుత్రుఁడనియుఁ బవనతనయుఁడనియుఁ బేర్లువచ్చినవి. తండ్రియగు పాండురాజు శాపోపహతుఁడై శతశృంగపర్వతమున నివాసముచేయు చుండినపుడు దేవతల మహిమవలన ధర్మజ భీమార్జున నకుల సహదేవులు అతనికిఁబుట్టి పెరుగుచుండిరి. ఇట్లుండ పాండురాజును మాద్రియు విచిత్రముగఁ జనిపోయిరి. మునులందఱుఁ జేరి, తండ్రి పోయిన తరువాత బిడ్డలకు విద్యాబుద్ధులు సెప్పువారు లేరుగదా యని యోజించి, వారినందఱను పెద్దనాయనయగు ధృతరాష్ట్రుని యొద్ద విడుచుట మంచిదని తలఁచి, కుంతిని, బాలురగు ధర్మజ భీమార్జున నకుల సహదేవులను బిలుచుకొని, ధృతరాష్ట్రుఁ డుండు హస్తినాపురమునకు వచ్చిరి. ధృతరాష్ట్రుఁడును అతని కొమారులగు దుర్యోధనాదులును, తాత యగు భీష్ముఁడును,




భీముఁడు బాలుర నెక్కించుకొని పరుగిడుట.

అందఱును నెదురుగా వెళ్లి పాండవులను వెంటఁబెట్టుకొని వచ్చిరి. పాండుపుత్రులు పెద్దల కందఱకును నమస్కరించిరి. ఒండొరులను బ్రీతిపూర్వకముగాఁ గౌఁగిలించుకొని, యొద్దికతో రాజమందిరముననేయుండిరి. కొంతకాలమువఱకు ధృతరాష్ట్రుఁడు తనకొడుకులనియు తమ్మునికొడుకులనియు, పక్షపాత మించుకైనను జూపక, అందఱను నొకేవిధముగాఁ జూచుచుండెను. పాండవులకు దినదినముఁ బరిచయ మెక్కుడు కాఁగాఁ దమ యీడుగలవారగు దుర్యోధనాదులతోఁ గలిసి నాటలాడ మొదలుపెట్టిరి. అప్పుడు భీముని యపారబలము బయలయ్యెను.

భీముఁడనిన బాలురు గడగడ వడఁకెడువారు. పరుగు పందెము వేసినపు డందఱకంటెను భీముఁడు ముందుఁ బరుగెత్తుచుండెడువాఁడు. ఒక్కొక్క రొక్కొక్క బాలు నెత్తుకొని పరుగుపందెము వేయునపుడు భీముఁడు పదుగుర నెత్తుకొని, అనాయాసముగఁ బరుగెత్తుచుండెను. కుస్తీపందెమున భీముని పదుగు రెదిరించినను లక్ష్యపెట్టక వారినందఱను బడఁద్రోసి కాళ్లు పట్టుకొని యీడ్చుచు, మొత్తుకొనినను విడువకుండు వాఁడు. జలక్రీడ లనుపేరున నీఁదుటకు గంగానదికి వెళ్లినపుడు దుర్యోధనాదులను నీట ముంచి ముప్పతిప్పలు పెట్టుచుండెడి వాఁడు. ఒకనాఁడు వీరందఱు చెట్టు నెక్కి మామిడిపండ్లను గోయుచుండిరి. భీముఁ డచటికి నిమ్మళముగా వెళ్లి, చెట్టును బట్టుకొని మెల్లఁగాఁ గదలించెను. చెట్టుమీఁద నుండిన బాలురులికిపడి యటునిటుఁ జూచుచుండిరి. భూమి కదలినట్లున్నదని యొకఁడనెను. కాదు, కాదు. భూమిగాదు కదలినది. నీతల,




భీముఁడు మామిడిచెట్లను నల్లలనాడించి దుర్యోధనాదులఁ క్రిందఁగూల్చుట.

యని నవ్వుచు మఱియొకఁడనెను. మూఁడవవాఁడు క్రిందికిఁ బాఱఁజూచి 'మీరిద్దఱు గ్రుడ్డివారలే. క్రిందఁజూడుఁడు. మన భీమన్న చెట్టునొద్ద నిలిచియున్నాఁడు. అతఁడు చేసినకొంటె తనమేగాని మఱియొకటికాదు.' అని యనుకొనుచుండఁగా భీముఁడా చెట్టును బట్టుకొని యల్లలనాడించెను. మామిడికాయలు రాలెను. వానిఁ గోయుచుండిన బాలురలోఁ గొందఱు దబ్బున నేలఁగూలిరి. కొందఱుకొొక చేతిపట్టు తప్పిపోవుటచేత వ్రేలాడుచు, పడిన నేమగునో యని యేడ్చుచుండిరి. కొందఱు కొమ్మను గట్టిగాఁ బట్టుకొని పడుదుమేమో యని భయపడుచుండిరి. ఇట్లు భీముఁడు దుర్యోధనాదులను దన కొంటెపనులచేతఁ బీడించుచుండినను, వారల కెప్పుడును హానిజేసినవాఁడు కాఁడు. చేయ నుద్దేశించియైనను నుండలేదు. అయినను దుర్యోధనాదులు భీమునిఁ గలవరించుకొని త్రుళ్లిపడి లేచుచుండెడివారు.

## 2. భీముని జంపు యోజనలు.

కొంతకాల మిట్లు జరిగెను. దుర్యోధనాదు లేవిషయమునందును భీముని మించఁ జాలరైరి. ఆ కారణముచేత వారలందఱకును భీమునియం దసూయ పుట్టెను. అందులో దుర్యోధనున కీ యసూయ మఱింత యెక్కువగ నుండెను. కావున నెట్లయినను భీమునిఁ గడతేర్పవలయునని, మాయోపాయములెన్నియో చేయుచుండెను. ఒకనాఁడు భీముఁడందఱతోను గుస్తీపట్టుపట్టి యలసి నిద్రించుచుండెను. అప్పుడు వాని కాలుసేతులను గట్టిగఁ దీఁగలచేతఁ గట్టించి గంగానదిలోని మడుఁగులో నొకదానియందు దుర్యోధనుఁడు త్రో




భీముని నాగుఁబాములచే దుర్యోధనుఁడు కఱపించుట

యించెను. నీటఁ బడినభీమునకు మెలఁకువ వచ్చెను. అపారబలుఁడగు భీముఁ డొక్కమాఱు నీల్గినతోడనే, ఆకట్లన్నియుఁ బటపటఁ దెగిపోయెను. భీముఁ డీఁదుకొని గట్టునకు వచ్చెను. మఱియొక మాఱు భీముఁడొడలు మఱచి నిద్రించుచుండఁగా సారథిచేత వాని దేహమునంతను కోఁడెనాగుఁ బాములచేఁ గఱపించెను. కాని యాతని వజ్రదేహమునకు విష మెక్కినది కాదు. భీముఁడు నిద్రలేచి తనయఱచేతఁ బాముల నన్నిటిని నేలమీఁద రాచి చంపి. ఒక్కదెబ్బచే సారథిని యమలోకమునకనిపెను.

చ. అలఘుబలుండు భీముఁడును, నంతన మేల్కని, యవ్విషోరగం
బులఁ జరణంబులం జమరి, ముక్కున వాతను నెత్తురొల్కఁగాఁ
దలరఁగ సారథిం జఱచెఁ దానవహస్తమునన్, వసుంధరా
తలమునఁ ద్రెళ్ళి సారథియుఁ దత్క్షణమాత్రన ముక్తజీవుఁడై.

ఇంకొక సమయమున నన్నములో విషము గల్పించి భీమునకు దుర్యోధనుఁడు పెట్టించెను. కాని భీముఁ డావిషమును జీర్ణించుకొనెను.

దీనింజూచి భీమసేనుఁడు మొండిప్రాణము గలవాఁడని యెంచి, ఇంతకంటెను దారుణమైన విషమును బెట్టింపవలయునని యుపాయ మాలోచించి 'అందఱము వనవిహారమునకై గంగానదీతీరమున నుండు నుద్యానవనమునకుఁ బోదము' అని దుర్యోధనుఁడు ప్రస్తావించెను. ఆమాయకుఁడగు ధర్మరా జందుల కొప్పుకొనెను. పాండు నందను లందఱు సమ్మతించిరి. తోఁటవిందునకుఁ దగినప్రయత్నములు చేయఁబడెను. మంచి గుడారములు తోఁటలలో వేసిరి. పేరొందిన వంటవాండ్రు

ముందుగా వెళ్ళి తోఁటలో భక్ష్యములుచేసి సిద్ధముగ నుంచిరి. అందొక వంటవానితో దుర్యోధనుఁడు ముందుగా మాటలాడి భక్ష్యములలోఁ గొన్నిఁటియందు కాలకూటవిషమును బెట్టించియుండెను. ఇట్లంతయు సిద్ధముగా నున్నదని తెలిసి రాజకుమారు లందఱును, విహారమునకు వెడలి, యుద్యానవనంబునఁ జేరి జలక్రీడలాడుటకు ముందు జిఱుతిండిఁ దినఁదలంచి భక్ష్యముల గంపనెత్తుకొని, యొండొరుల నోటిలో భక్ష్యములుతుఱుముచు భుజించుచుండిరి. దుర్యోధనుఁడు విషభక్ష్యములను దీసికొని, మిక్కిలి ప్రేమగలవానివలె భీముని సమీపించి వానినోట నాభక్ష్యములనుదుఱిమెను. ఏమియు నెఱుంగని యాభీముఁడు వానిని నమలి మ్రింగెను. దుర్యోధనుఁడు జయప్రదముగా నెఱవేర్చిన పనికి సంతసించి, భీముని మరణమున కెదురుచూచుచు, ఎందునయిన మంచిదనితలఁచి, మఱియొక యుపాయముఁ గూడ చేసెను. ఏమనగా, జిఱుతిండియయినతరువాత జలక్రీడలాడుట వాడుక కావున, సమయము చూచి, భీమసేనుని నీట ద్రోయింపవలయునని యెంచి పాములుండు మడుఁగున బల్లెముల జేనెఁడు కొకటివంతున నీటిలో గట్టిగాఁ బాతించి యుంచెను.

అల్పాహారమయినతోడనే రాజకుమారు లందఱు జలక్రీడలకై గంగానదిని సమీపించిరి. భీముఁడుకూడ వచ్చెను. వీరిన్నందఱును నీటిలోనాడించి, కొందఱను మోసికొనిపోవుచుఁ గొందఱను నీట ముంచి ముప్పు తిప్పలు పెట్టుచుఁ గొంతసేపటికి భీముఁ డలసి బయటికి వచ్చెను. ఈయలసటకుఁ దోడుగా నొంటినిండ విషము చేరుటచేత మత్తెక్కి నిదురించువానివలె

నొకచోటఁ బడియుండెను. సమయము కనిపెట్టియుండిన దుర్యోధనుఁడు "జలక్రీడ లింకఁ జాలింతము. భోజనసమయ మయిన" దని చెప్పఁగాఁ బాలురందఱును గంగగట్టును వదలి తోఁటలోనికి వెళ్లిరి. ఎవరును లేకుండుటఁ జూచి, మత్తెక్కి పడియుండు భీముని కాలుసేతులు త్రాళ్ళతో బిగియఁ గట్టించి వానిని నీటఁ ద్రోయించెను. భీముఁడు మిక్కిలి బరువైన దేహముఁగలవాఁడు కావున, డుబ్బున నీట మునిఁగెను. భీముఁ డింతటితోఁ గడతేఱె నని యెంచి, మనస్సులో నానందపడుచు, వనభోజన మయిన పిమ్మట రాకొమరులందఱింటికిమరలిరి. భీమునిఁగానక పాఁడవేయులును గుంతియును దపించుచు దుర్యోధను నడుగ "భీముఁడందఱకంటెను ముందుగా బయలుదేఱి పురమునకు వెళ్ళె" నని చెప్పి వారలను బంపివేసెను. ధర్మరాజాదులు భీమునికొఱ కంతటను వెదకించు చుండిరి. దినములు గడచు చుండెను.

అక్కడ నీటఁ ద్రోయబడిన భీముఁడు, అదృష్టవశమున బల్లెములమీఁద బడినాఁడుకాఁడు. కాని యితఁడు బుడుంగున నీటిలో నట్టడుగునకు మునిఁగెను. అచటనుండు పాములతని దేహ మంతటను గఱచెను. భీమునిదేహమున నప్పటికే కాలకూటవిషముండుటచేతఁ నాపాములవిషమాతని నేమియుఁ జేసినదికాదు. పాములె యాతనివిషముచేతఁ జచ్చిపోయినవి. దీనింజూచి యానాగు లాశ్చర్యపడి 'ఇదియేమి? మన విషము వలన నితఁడు చచ్చుటకు బదులు మనమే మృతినొందుచున్నాము. ఈ చిత్రము మనరాజగు వాసుకితోఁ లజెప్పవయును' అని యనుకొనుచుండఁగా భీముఁడు లేచి పాములను నలియఁ

గొట్టుచుండెను. పాములుభయపడి నాగలోకమునకుఁ బోయి వాసుకినిఁ బిలుచుకొని వచ్చెను. అందులో నొక నాగుఁడు భీముని జూచి, తన సంతతివానిగా గుర్తించి వాసుకికిఁ జెప్పఁగా 'ఆహా! ఈభీముఁడు మనవాడా? అట్లయిన వీనికిఁ గావలసినంత ధన మిత్తము' అనెను "భీమునికి ధన మెందులకు? వేయి యేనుఁగుల బలము నిచ్చురసము త్రాగనిత్తము' అని నాగులు చెప్పుట విని వాసుకి "బాగు, అటులే కానిండు" అని వేయియేనుఁగుల బలము నిచ్చురసము నొక కుండనిండఁ బోసి, అట్టి కుండలను పదింటిని భీమునియెదుటఁ బెట్టిరి. భీముఁడు స్నానముచేసి శుచియై యొకగుటుకకు నొక్కకుండెడువంతునఁ బదికుండల రసముఁ ద్రావెను. అంతట భోజనభారముచేత నిద్రపట్టి గాఢనిద్రఁజెంది యెనిమిదవ దినమున నిద్రలేచి శుద్ధజలంబుల స్నానంబు చేసి చలువ వస్త్రములను ధరించియుండెను. ఇంతలో నాతనికిఁ బంచభక్ష్య పరమాన్నంబులు వడ్డించిరి. కడుపునిండ భోజనముచేసి, వారిచేత నాశీర్వాదములుపొంది నాగలోకమునుండి భీముఁడు బయలుదేఱెను. నాగులతనినొక నిమిషములో నీటిపైకిఁదెచ్చి, వనభోజనము జరిగిన యుద్యానవనమునందు విడిచిరి. అపారబలుఁడని పేరుపొందిన యాభీముఁ డింటికివచ్చి, తల్లికిని నన్నకును మిగిలిన పెద్దలకు నమస్కారముచేసి, దుర్యోధనుఁడు చేసిన ద్రోహమును నాగలోకమున జరిగినసమాచారమును పూసగ్రుచ్చినట్లు చెప్పెను. భీముఁడు బ్రతికివచ్చెఁగదా యని యందఱు సంతోషించి అప్పటినుండి దుర్యోధనునియెడ జాగ్రత్తగా మెలఁగుచుండిరి.

ఇట్లెన్ని యో ప్రయత్నములుచేసి, అన్నియు నిష్ఫలములగుటచేత, దుర్యోధనుని క్రోధము మఱింత యెక్కువయయ్యెను. పాండునందనులనందఱను నెట్లయినఁ జంపవలయునని దీక్ష వహించి, అందులకై దుర్యోధనుఁడు సర్వప్రయత్నములు చేయుచుండెను.

## 3. భీముఁడు విద్య నేర్చుకొనుట.

ధృతరాష్ట్రుఁడు బాలుర కందఱకును ధనుర్విద్య చెప్పింపఁదలఁచి తనకొడుకులను, బాండవేయులను, ద్రోణాచార్యుల వద్దకుఁ బంపెను. వారందఱు మిక్కిలి శ్రద్ధగా విలువిద్య నేర్చుకొనుచుండిరి. కొంతకాలమునకు గురువగు ద్రోణాచార్యులు వీరినందఱఁ బరీక్షచేసి ధనుర్విద్యయం దర్జునుఁడు మొదటివాఁడని తెలిసికొని యాతనికి నెక్కువ ప్రేమతో విద్యనంతయునేర్పెను. ఇట్లనుటచేత మిగిలినవారు విద్య నేర్చినవారు కారని చెప్పుటకాదు. అందఱును నేర్చినమాట నిజమే; కాని యెవ్వరును నర్జునునివలె నైపుణ్యమును జూపినవారు కారు. కుమారు లెంతవిద్య నేర్చుకొనిరో పరీక్షింపవలయునని ధృతరాష్ట్రునకుఁ గోరిక గలిగెను. వీరలవిద్యఁ జూపుటకు మంచిస్థల మేర్పాటుచేసిరి. నడుమ వారు నేర్చిన ధనుర్విద్యలు చూపుటకును, కుస్తీలుపట్టుటకును, తగినరంగమును సిద్ధపఱచి, దానిచుట్టును సోపానపఙ్క్తిని (Gallery) నొకదానిని గట్టించి స్త్రీలకును రాజవంశజులకును, ఇతర సామాన్యజనులకును, ప్రత్యేకస్థలముల నేర్పాటుచేసిరి. ఆకాలమున స్త్రీలకు ఘోషా లేదుగనుక రాజుభార్య యగు గాంధారియు, పాండ

వుల తల్లి కుంతియు, మొదలుగాఁగల స్త్రీలందఱువిచ్చేసి, వారి వారి కేర్పఱుపఁబడిన స్థలముల నలంకరించిరి.

ఇట్లు జనులందఱు చేరి, జరుగఁబోవు పందెములను జూచుటకు ముచ్చట పడుచుండిరి. ద్రోణాచార్యుఁడు తెల్లని వస్త్రములు ధరించి, పట్టువస్త్రము నొకదానిని వల్లెవాటు వేసికొని, రంగమధ్యమునకు వచ్చెను. అతనివెంబడి విల్లులను అంబులను ధరించియున్న శిష్యులందఱు రంగస్థలమునకు వచ్చి, గురువు నాజ్ఞాప్రకారము వారి వారిశక్తి నైపుణ్యములను జూపుచువచ్చిరి. తరువాత భుజబలమునకు పేరొందిన భీమ దుర్యోధనులు గదలు ధరించి యుద్ధమునకై రంగము ప్రవేశించి, హోరాహోరిఁ బోరుచుండిరి. చూపరులు గొందఱు దుర్యోధనుని, కొందఱు భీమునిఁ బొగడుచుఁ బక్షపాతమును బూని క్రోధము పెంపుఁజేయు మాట లాడుచుండుటచేత, భీమదుర్యోధనుల గదాయుద్ధ మపాయకరముగాఁ బరిణమించు నని తలంచి ద్రోణుఁ డాయుద్ధమును నాపివేసెను.

అప్పటినుండియు దుర్యోధనుని కోపమునకును వాని యసూయకును మితియే లేకుండెను. కాని యింతవరకును దనతండ్రియగు ధృతరాష్ట్రునకుఁ దన మనోదుఃఖమును దెల్పిన వాఁడు కాఁడు. ఇపుడు తండ్రిని సమీపించి ఆయనతోఁ జెప్ప వలసిన మాటలన్నియుఁజెప్పి, పాండవులను వారణావతంబునకుఁ బంపునట్లుచేసెను.

## 4. వారణావతంబున లక్కయిల్లు కాల్చుట.

పాండవులు వారణావతంబునకుఁ బోవుటకు ముందుఁగా దుర్యోధనుని పంపున నచట నొక లక్కయిల్లు కట్టింపఁబడి యుండెను. ఆగృహములో బాండవులుండిరి. అట్లుండ విదురుని వలన దుర్యోధనుని మాయోపాయములు పాండవులకుఁ దెలియవచ్చెను. వారు లక్కయింటినుండి లోపలనె యొక సొరంగము వేయించియుండి, లక్కయింటిని గాల్పఁబోవుదినమున దానికిఁ దామే నిప్పంటించి, అందఱును సొరంగమునుండి క్షేమముగా బయటికి వెళ్లిపోయిరి. ఆ రాత్రి చిమ్మచీఁకటిగానుండుటచేతను, అందఱకును నిద్రాసమయ మగుటచేతను, కుంతిగాని భీముని యన్నదమ్ములుగాని యడుగిడఁజాలక నెమ్మదిగా నడుచుచుండిరి. భీముఁడు తల్లిని నన్నదమ్ముల నెత్తుకొని, ముండ్లు గిండ్లనక, వృక్షముల నటునిటుఁ ద్రోయుచు, అడుగులక్రిందఁ బడినకొమ్మలు రాళ్లు, పిండి పిండి యగుచుండ, మిక్కిలి త్వరితముగఁ బరుగిడి గంగానదిని సమీపించెను. అచట విదురునిచేఁ బంపఁబడిన జాలరివాండ్రరాజు, పాండవుల కొఱకుఁ గాచుకొనియుండి, వారు వచ్చినతోడనే క్షేమముగా గంగను దాఁటించి వారిని గౌరవించి పంపెను.

పాండవులు గంగనుదాఁటి దక్షిణమునకుఁ బ్రయాణమయి యడవినుండి యడవికి వెళ్ళుచు ఆఁకలిచేతను దప్పిచేతను నలసి ముందు నడువఁజాలకుండిరి. ఇట్లుండ వీరినందఱను భీముఁడు మరలఁ దనమీఁద నెక్కించుకొని, మిక్కిలి వేగముగా నడువ నారంభించెను. తల్లికి దప్పి యధికమయ్యెను. భీముఁడు

నీటికొఱకు వెదకుచుండ, నీటికొంగ లాయడవిలోఁ గనఁబడుట చేత, నీరు సమీపమున నుండునని తలఁచి, యా నట్టడవిలో



భీముఁడు అన్నదమ్ములను, దల్లిని మోసికొనిపోవుట.

నూడలువాఱి చల్లఁగనుండు మఱ్ఱిచెట్టుక్రింద వారి నందఱను దింపెను. తోడనే యలసియున్న వారందఱు వట్టినేలమీఁదఁ బండుకొని, తలక్రిందఁ జేతులు పెట్టుకొని గాఢనిద్రఁ జెందిరి. భీమునకు నీటిపఱ్ఱు లగఁపడఁగా సమీపమున నీరున్నదని యతఁడు తలంచి యొక మఱ్ఱిచెట్టునెక్కి-నాలుగువైపులు చూచెను. దూరమున నొక సరోవర మగపడెను. భీముఁడు తత్క్షణమా చెట్టుదిగి యాకొలనికి వెళ్ళి, అందు స్నానముచేసి, కడుపునిండ నీరుత్రాగి, తామరాకు దొన్నెలలోఁ గొంతనీరు పట్టుకొని, మఱ్ఱిచెట్టునొద్దకు వచ్చెను. అప్పుడందఱు గాఢమైన నిద్ర పోవు చుండిరి. వారికి నిద్రాభంగము చేయఁగూడదని ప్రక్క-న కూర్చుండి, మనసులోనిట్లు తలపోసికొను చుండెను. "అయ్యో ఏమిదుర్దశ!! భోజరాజునకుఁ గూఁతురయి, వసుదేవుని తోఁబుట్టువయి, పాండురాజునకు భార్యయయి, పైఁగా ధర్మపరులైన పాండవేయులకుఁ దల్లియయిన యీ కుంతీదేవి, మెత్తనిపాన్పు మీఁదఁ బరుండు నీ సుకుమారి, కాలవశంబునఁ గటికనేల మీఁదఁ బరుండియున్నది ! బలశాలురయిన నా యన్నదమ్ము లిట్లడవుల పాలయిరి. ఇంత భుజబల ముండియు మాయన్న యగు ధర్మజుఁ డొప్పుకొనకుండుటచేతఁగదా, మాకందఱకును నిట్టి కష్టములు వచ్చియుండుట. లేకుండిన నా దుర్యోధనాదులను, ఆదుర్మార్గుఁడగు శకుని మొదలుగాఁగల తుచ్ఛులనెల్లను, నాగదాదండంబుచేత నుగ్గాడి యుండియుందునుగదా! అయ్యో న్యాయవర్తన మెంతచిక్కు-ల కాకరమయినది!" అని పరిపరి విధములఁ గంటఁదడిపెట్టుకొని భీముఁడు విచారపడుచుండెను.

## 5. హిడింబాసురుని వధ, ఘటోత్కచుని పుట్టుక.

భీముఁడిట్లు మేల్కొని మనంబున విచారించుచుండ నాయరణ్యమునకు నాయకుఁడైన హిడింబునకు మనుష్యుల వాసన తగిలెను. 'అహా! ఏమిసుదినమిది! ప్రతిదినము మృగముల మాంసమును దిని నాలుక మొద్దుపడి యున్నది. నేఁడు నరమాంసము దొరకునట్లున్నది' అనుకొనుచు నొకచెట్టునెక్కి మఱ్ఱిచెట్టుక్రిందఁ బరుండియుండు పాండవులంజూచి 'ఏమిది! నావనంబునం దింతనిర్భయముగా మైమఱచి నిద్రపోవుచుండు వా రెవరయి యుందురు! ఎవరైననేమి? వంటయింటిలోనికి వచ్చిన కుందేటి బ్రతుకువంటిదే కదా వీరిబ్రతుకు'

ఉ॥ ఇందులకెప్పుడయిన మనుజులెన్నఁడు వత్తురె? వచ్చిరేని యా
నందముఁబొంది నిర్భయమునన్ శయనింతురె యిట్లు? "వంటయిల్
కుందెలుసొచ్చె" వేగఁజని కోమలి వారలఁజంపి తెచ్చి నా
కుం దగ వండిపెట్టుము రసోత్కట మానవమాంస ఖండముల్.

అని సంతోషించుచుఁ జెల్లెలగు హిడింబనుఁ బిలిచి 'చెల్లెలా! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు మనకు నరమాంసము లభింపనున్నది! అల్లదిగో చూడుము. ఆమఱ్ఱిచెట్టుక్రిందఁ గొందఱు మానవులు పరుండి యున్నారు. వారలఁజంపి తెచ్చి నాకు రుచిగా వండిపెట్టుము. కడుపారఁదిని యామీఁద నాట్యము చేయుదము. తడవుసేయకుము' అనిచెప్పి పంపి యామెరాక కెదురుచూచుచు, గుటకలు మ్రింగుచుండెను.

హిడింబ చప్పుడు చేయకుండ వేగిరముగా నడిచి చెట్టుక్రిందఁ గూర్చుండి యుండు సుందరపురుషుఁ డగు భీమునింజూచి యాశ్చర్యపడి "ఏమి యీ చక్కఁదనము! ఏమి

యీయాయంగముల సొంపు! పొడుగైనచేతులు, తామరరేకుల వంటి కన్నులు, విశాలమైన రొమ్ము! ఆహా! ఇట్టిపురుషుఁడు కదా నాకు భర్త కావలయును! ఇట్టివానినా, నేను జంపుట" అని యనుకొని, ఎటులైనను భీమునిఁ బెండ్లి చేసికొనవలయునని నిశ్చయించి, తన రాక్షసరూపమును వదలి, సుందరమైన మనుష్యస్త్రీరూపమును దాల్చి, అల్లనల్లన భీమునిసమీపించి యిట్లనియె. "పురుషసత్తమా! మీ రెవరు? మీ రిక్కడకు వచ్చుటకుఁ గారణం బేమి? ఈ నిద్రించుచున్న వారు మీ కేమి కావలయును ?"

భీము:—యువతీ! ఈమె నాతల్లి. మిగిలినవారు నా యన్న దమ్ములు. నీ వెవతవు? ఈయరణ్యమునఁ దిరుగుటకుఁ గారణ మేమి?

హిడింబ:—సుందరాకారా! నే నీ యడవులకు రాజైన హిడింబుఁడను రాక్షసుని చెలియలను. మీరుండుట పసిపట్టి మిమ్ములఁ జంపి తెమ్మని మాయన్న నన్నుఁ బంపెను. ఆ కారణమున నిట వచ్చితి. నీ సుందరవదన సందర్శనముఁ జేసితి. ధన్య నయితి. నీయందు నా మనంబు తగిలి యున్నది. కావున నో దయామయా! నీవు నాకుఁ బతివి కావలయు. నావెంట వచ్చిననిన్ను రక్షించెదను.

భీము:—ఇతఁడు మాయన్న. ఇతని కింకను వివాహము కాలేదు. నేనెట్లు వివాహము చేసికొన నగును? అది యునుంగాక యొకరాక్షసాధమునికి వెఱచి నీవెంట నన్ను రమ్మనుచున్నావు! నా తల్లిని నన్నదమ్ములను దిగవిడువు మనుచున్నావు కదా! ఎప్పటికిని నే నట్లు

చేయను. నీవు నీదారిని బొమ్ము. లేకుండిన నుండుము. నీ యిష్టము వచ్చినట్లు చేయుము.

హిడింబ:—మహాప్రభూ! నిన్ను వలచితి. నిన్నుఁ దప్ప మఱి యొకనిఁ బెండ్లి యాడను. నీవు వలదన్న ప్రాణత్యాగము చేసికొనెదను గాని నీవులేని బ్రతుకు బ్రతుకు కాదు. కావున నాకుఁబతివి గమ్ము. మీవారల నందఱను నామీఁద నెక్కించుకొని పోయి క్షేమముగా నొకచోట విడిచెదను. వారిని నిద్రనుండి లేపుము.

భీము;—నీయన్నకు వెఱచి, హాయిగా నిద్రించుచున్న నా సోదరులను దల్లిని నిద్రనుండి లేపుమనుచున్నావు! నేనొక రాక్షసాధమునకు వెఱచి అట్లు చేయుదునా?

ఉ. క్రచ్చఱ నొక్కరక్కసుఁడకాఁడు, సురాసురు లెల్ల నొక్కఁడై
వచ్చిన, నీవ చూడఁగ నవార్యబలోన్నతిఁ జేసి వారల
న్వచ్చి వధింతుఁగాక, యిటువచ్చి శ్రమంబడియున్న నిచ్చట
న్మెచ్చగు వీరిదైవ సుఖనిద్రకు భంగముసేయ నేర్తునే?

నీకోరికయు నెఱవేర్పఁ జాలను. నీవురక్కసివి, నేను మనుష్యుఁడను. మనకెట్లు స్నేహము పొసగఁ గలదు?

హిడింబ:—ప్రాణనాథా! రక్షింపుము. రక్షింపుము. నేనురక్కసినే కాని నీవుకోరెనరూపముఁ దాల్పఁగలదానను. నీ యిచ్చవచ్చినట్లు మెలఁగఁ గలదానను. నన్నాదరించి చంపక నాయందు దయయుంచి పతి వయి సర్వవిధముల సుఖింపుము.

ఇట్లు భీమసేనుని వలచి, వచ్చినపని మఱచి హిడింబ మాట లాడుచుండుటచేతఁ బడ వయ్యెను. 'హిడింబ వెళ్ళి

యింకను రాకున్నది.' అని కోపమున బిఱ బిఱ వచ్చుచు హిడింబాసురుఁడు దూరమునుండి తన చెల్లెలును భీమసేనుఁడును మాట లాడుచుండుటఁ జూచి, హిడింబ భీముని మోహించినదని తెలిసికొని, మండిపడుచుఁ గను లెఱ్ఱఁజేసి పండ్లు పటపట గీటుచు, భీముని హిడింబను జంపుటకై బొబ్బలిడుచు, సమీపమునకు వచ్చుచుండెను.

సామాన్యు లెవరైన నాహిడింబునిజూచి యుండు రేని నిలువునఁ బ్రాణములు విడిచియుందురు. బొగ్గువలె నల్లని దేహమును, పెద్దతొడలును, పొడుగైనచేతులును గలిగి, చింత నిప్పులవలెఁగాంతినిచ్చు నెఱ్ఱనికన్నులు తెల్లని కోరలు పయికిఁ గనఁబడుచుండ, బిరుసైన వెండ్రుకలు గాలిలోఁ గదలుచుండ భీకరస్వరూపముతో దిక్కులు పగులునట్లు కేకలు వేయుచుఁ పరుగెత్తుచుండిన యా పెనుభూతమును జూచి సామాన్య మానవు లెవరైన నిలిచి జీవింపఁ గల్గుదురా? హిడింబ తన యన్నయొక్క రాఁకం జూచి తడవుచేసినందులకుఁ దన్నుఁ గూడఁ జంపునని భీముని వెనుకకు వెళ్లెను. భీముఁ డంతట 'భయపడవలదు. నీయన్న నిప్పుడే బరిమార్చెద' నని చెప్పి రాక్షసుని వంకఁదిరిగి 'ఓరిరాక్షసాధమా! కండకావరమునఁ బోతరించి మండిపడుచున్నావు. అలసి పరుండి యున్నవారి నిద్రకు భంగము సేయరాదు. స్త్రీమీఁదనా నీ పౌరుషము చూపఁదలఁచుట? 'ముప్పదియేండ్లు సాముచేసి ముసలమ్మను గొట్టె' నన్నమాట నిజము చేయుచున్నావు! ఛీ! నీచుఁడా ఇట్లు రాకు' అని నెమ్మదిగాఁ జెప్పెను.

ఉ॥ పన్నగవైరి విక్రముఁడు పాండవసింహము దానిఁ జూచి 'మీ
యన్నను నన్నుఁ జూడుము, భయంపడకుండుమ' యంచు వానిన
త్యున్నతుఁ దాఁకి, రాక్షస! వధోచిత! నీబలగర్వ మేదఁగా
నిన్ను వధించి యివ్వనము నెట్టనచేసెద నిర్భయంబుగాన్.

కాని రాక్షసుఁ డామాటను వినక, బొబ్బలు పెట్టుచు కొట్టువానివలెఁ జేతులుపైకెత్తి సమీపించుటఁజూచి, భీముఁడు ముందుకు వెళ్ళి, నవ్వుచు వానిచేతులను బిగియఁ బట్టుకొని కొంతదూర మారాక్షసు నీడ్చుకొని పోయెను. హిడింబునకుఁ గోప మెక్కు-వయ్యెను. వాఁడు మఱింతగట్టిగాఁ గేకలు వేయుటవలనఁ దనసోదరులు మేలుకొందు రనుభయముచేత హిడింబుని చేతులు పట్టుకొని, చచ్చినకుక్క నీడ్చుకొనిపోయి నట్లు వానిని జాలదూరగ మీడ్చుకొని పోవుచుండెను.

ఇంతలో హిడింబుని యార్భాటములకుఁ బాండు సుతులు మేల్కొ-నిరి. కుంతియు నిద్రలేచెను. ఎదుటఁ జక్క-నిస్త్రీ యొకతె నిలువఁబడియుండెను.

కుంతి—అమ్మా! నీ వెవ్వతెవు? మానవుల కింతటి సౌందర్యము గలుగుట యరిది. నీవు దేవతాస్త్రీవయి యుందువు కాఁబోలును! నీ పేరేమి? నీవెవ్వరిదానవు? ఒంటరిగా నీయరణ్యమున నెందున కున్న దానవు?

హిడిం—అమ్మా! చూడు మీయరణ్యము. దీనికి నాథుండు హిడింబాసురుఁడు. నే నాతని చెలియలను. మిమ్ముఁ జంపి మీ మాంసము వండి పెట్టుమని చెప్పఁగా నేనిచటికి వచ్చితిని. సౌందర్య పురుషుండగు భీమునిం జూచితి. మోహించితి. దాసురాల నయితి

కుంతి—(నలుగడలు చూచి) ఏఁడీ! భీముఁడు?




భీముఁడు హిడింబాసురుని జంపుట.

హిడిం—నేను జాగు చేసితినని కోపముతో వచ్చుచుండిన మాయన్న నెదుర్కొని యుద్ధముచేయుటకు దూరము వెళ్ళియున్నాఁడు.

ఈమాట విన్నతోడనే యర్జునాదు లులికిపడి లేచి భీముఁడు యుద్ధము చేయుచున్నచోటికిఁ బోయి చూచిరి; ఏమని చెప్పుదును! చెట్లను బెల్లగించి వా రొండొరులు బాదుకొనుచుండిరి. సమీపమున నుండిన చెట్లన్నియుఁ బాడయి నేల బీడయ్యెను. పిమ్మట ముష్టియుద్ధమునకు దిగి, ఒకరి నొకరు చేతులతోఁ బొడుచుకొనుచుఁ గాళ్ళతో దన్నుకొనుచును క్రింద మీఁదఁబడి వారు హోరా హోరి బోరాడుచుండిరి. అపుడు సంజవేళ యగుటచేత, రాక్షసుల బలకాలము వచ్చుచున్నదని యర్జునుఁడు హెచ్చరింపఁగా, భీముఁడు మిక్కిలి విజృంభించి హిడింబుని మెడవిఱిచి నడుము రెండుతునకలు జేసి పైకెగురఁదన్నెను. భీమసేనుని పరాక్రమముచేత హిడింబుఁ డిట్లు మడియుటఁ జూచి, యందఱు సంతోషించి ముందునడుచుచుండిరి. కాని హిడింబ వారివెంట నంటి భీముని సమీపించి 'పురుషశ్రేష్ఠా! నీయందలి ప్రేమ చేత నిన్ను విడువఁజాలకున్నాను. నన్నుఁ జేకొని రక్షింపుము' అని వేఁడుకొనఁగా 'నీవును రాక్షసివేకదా. మాయ చేత మమ్ము మోసము చేయవచ్చితివి కాఁబోలును. నిన్నుఁ గూడ వధించుటయే యుత్తమము' అని భీముఁడు చెప్పఁగా, ఆమాటలకు బెదరి, ధర్మరాజునొద్దకు వచ్చి, యాతనికి నమస్కరించి పిదప కుంతీదేవి కాళ్లమీఁదఁబడి, కన్నీరు కార్చుచు నిట్లనియె. 'అమ్మా! స్త్రీలకుఁ బ్రేమయనిన నేమియో

నీ వెఱుఁగనిదానవు కావు. నీ కుమారుఁడగు భీమసేనుని మీఁది ప్రేమచేత నే నిట్లు పరితపించు చున్నాను. బంధువుల నందఱను దిగవిడచి భీమునే పెనిమిటిగాఁ దలంచి వచ్చితిని కావున నన్నుఁ గాపాడి భీముఁడు నాభర్తగానుండునట్లు ప్రసాదింపుము. భీమునిఁ దోడ్కొని పగలంతయు మా యిష్టము చొప్పునఁ దిరిగి, రాత్రి మీసన్నిధానమునకు వచ్చి నే నూడిగము చేసెదను. వలసినచోటికి మిమ్మందఱ నెత్తుకొని పోయెదను. మీరు చెప్పిన పనుల నన్నిఁటినిఁ జేసెదను. ఇదియునుంగాక భూతభవిష్యత్తులు నేను దెలిసికొనఁగలను. కాన మీకు నే నెల్లప్పుడు చేదోడు వాదోడుగా నుండి, మీకు శ్రమయనునది లేకుండునట్లు చేయుదును. కావున దయచేసి భీముని నా కనుగ్రహించి నన్ను బ్రతికించి పుణ్యము గట్టుకొనుఁడు' అని పలువిధముల దీనాలాపములఁ బ్రార్థించుటఁ జూచి కుంతికి మనసు గరఁగెను. ఆఁమది గనుక పెరయాడువారికష్టసుఖములు సులభముగఁ దెలిసికొనఁ గలిగినదై, తనసమ్మతిని ధర్మరాజున కెఱిఁగింపఁగా ధర్మజుఁడు మంచిదని భీమునిఁ బిలిచి 'తమ్ముఁడా! అమ్మచెప్పినమాట వినుము. హిడింబను బరిణయముగుము.' అని చెప్పి యొప్పించి యొక సుముహూర్తమున వారికిఁ బెండ్లి చేసెను. పిమ్మటఁ బ్రతిదినము హిడింబ భీముని వనములలోనికి మోసికొనిపోయి, యచట హాయిగా సంచరించి సాయంకాలమునకు మరలఁ గుంతి యుండుస్థలమునకుఁ భీమునిఁ దెచ్చివిడుచుచు, కావలసినపను లన్నియు నింటియొద్దఁ జేయుచు, ధర్మరాజాదులకు భోజనపదార్థములఁ దెచ్చియిచ్చుచు నేఁడుమాసము లా యరణ్యమునందే గడపెను. అంతట నది

గర్భవతి యయ్యెను. తోడనే ఘటోత్కచుండను కుమారుఁడు పుట్టెను. ఇతఁడు మిక్కిలి బలపరాక్రమములు గలవాఁడు. కామరూపియు, కామగమనుండును నయి యుండెను. పుట్టిన తరువాతఁ దల్లిదండ్రులకును ధర్మరాజాదులకును నమస్కరించి, తలఁచినపుడు వచ్చి సాయము చేయుదు నని చెప్పి, తండ్రి యనుమతిం బొంది, తల్లినిగూడఁ బిలుచుకొని, తన పరివారమును వెంటఁబెట్టుకొని యుత్తరాభిముఖుండై వెడలెను.

6. ఏకచక్రనగరము, బకాసురుని వధ.

ఇట్లుండఁ దాతయగు వ్యాసమహాముని వలన బోధింపఁబడిన పాండవేయులు బ్రాహ్మణవేషమున దేశదేశములను గడచి చని, తుద కేకచక్రనగర మను నగ్రహారమును జేరి యొక బ్రాహ్మణునింట బసచేసి వేదాధ్యయనము చేయుచు మాసవ్రతముఁ బూని యింటింటికి వెళ్ళి మాధుకర మెత్తి, తాము ప్రోగుచేసిన యన్నమంతయుఁ దల్లియగు కుంతియొద్దఁ బెట్టుచుండిరి. ఆయన్నము నామె రెండుభాగములుగాఁ జేసి, యొకభాగమును భీమున కొకనికే యిచ్చుచుండెను. మఱి యొకభాగమును దాను మిగిలిన నలుగురు పాండవేయులును భుజించుచుండిరి; కాని యది భీమునికిఁ జాలకుండుటచేత నాతఁడు బలము తగ్గి పూర్వపుదేహ కాంతిఁ గోలుపోయినవాఁడయ్యెను.

ఒకనాఁడు ధర్మరాజాదులు భిక్షకై పట్టణములోనికి వెళ్ళిరి. కుంతియు భీముఁడును నింట నుండిరి. ఉన్నట్టుండి వారు దిగియుండు బ్రాహ్మణునింట నేడ్పు వినవచ్చెను. కుంతి భీమునిం బిలిచి "నాయనా! వింటివా ఆయార్తారవము! పాపము మనకు

బస యిచ్చి కాపాడుచున్న ఈబ్రాహ్మణున కేమి విపత్తు కలిగినదో తెలియకున్నది. మనల సంరక్షణ చేసిన యాతనికి మనము ప్రత్యుపకారము చేయుట ధర్మము కదా'' యనెను. "అమ్మా! నీవు చెప్పిన మాట నిజమే. ఆయన మన కిల్లియ్యఁ బట్టికదా దుర్యోధనునికంటఁ బడక రహస్యముగా నిచట నుం డుటకు వీలయినది. అట్టియుపకారికి మనము ప్రత్యుపకారము తప్పక చేయావలసినదే. అమ్మా! నీవొకమాఱు వారియింటి లోనికివెళ్లి వారెందున కేడ్చుచున్నారో కనుఁగొనిరమ్మ''అని చెప్పఁగా కుంతి బయలుదేఱి, మెల్లఁగా నింటిలోనికిఁ బోయి, వారిరోదనమున కేమి కారణ మని యడిగెను. బ్రాహ్మణుఁడు కన్నులు తుడుచుకొని 'అమ్మా! ఏమిచెప్పుదును! రేపు, మా లో నొక్కర మొకరక్కసునికి బలిగాఁ బోవలసి యున్నది. నా ప్రియభార్యను బంపనా? నాముద్దుల కూఁతును బంపనా? సుకుమారు నా చిన్న కుమారుని బంపనా? నేను వెళ్ళనా? యని తపించుచు దిక్కు తెలియక యేడ్చుచున్నాము. ఈవిప త్తునుండి మమ్మెవరు కాపాడగలరు? అయ్యో!' యని కన్నుల నీరుగాల గొంతుక నుండి మాట రాక నిశ్చేష్టితుఁడై నేల మీఁదఁ బడెను. కొంతసేపటికిఁ దెలివివచ్చెను. ఇంతలోగుంతి యోజించి తనకుమారుఁడగు భీముఁడు మిక్కిలి బలవంతుఁ డనియు రాక్షసాధముల నెందఱనో గిట్టించినవాఁ డనియుఁ నెఱింగినది కావున బ్రాహ్మణు నోదార్చి "ఆర్యా! ఒకమాట చెప్పెదను వినుఁడు. మఱియొకవిధముగాఁ దలఁపకుఁడు. మీ కొకపుత్రుఁడే కలఁడు. ఆ యొక్కనిఁ బంపుట కెవరికైన మన సొప్పునా! నాకైదుగురు కుమారులు గలరు. అందొకనిని

నేను బంపెదను"అనెను."అమ్మా! ఎంతపాప మెంతపాపము! మాయింటికతిథులుగా వచ్చియుండు మీబాలునిఁ బంపి బ్రహ్మ హత్య కొడిగట్టుకొందునా ! ఇది కానిపని" యని చెవులు మూసికొని మొదటికన్న నెక్కుడుగ విలపింప సాగెను. కుంతి యాతని నోదార్చి "అయ్యా! మీరు చింతింపవలదు, నేనంత వెఱ్ఱిదానను గాను. నాకొడుకు కెందఱనో రాక్షసుల పీచ మడంచినవాఁడు. వాఁడీరాక్షసునిఁ గూడ మృత్యువుపాలికిఁ బంపఁ గలఁడు. కావున మీరు భయపడకుఁడు. సందేహింపక మీప్రయత్నములు చేయుఁడు"అని చెప్పి "అయ్యా ! ఈనగరమునకు రాజొకఁడు గలఁడు గదా! ఆతఁడీరక్కసునిఁ జంపఁజాలఁడయ్యెనా యేమి? ఈరాక్షసుఁ డెవ్వఁడు? సవిస్తరముగాఁ జెప్పుఁడు" అని కుంతి యడిగెను. బ్రాహ్మణుఁడు కొంత నెమ్మది నొంది యిట్లనియె. "అమ్మా! రెండు మూఁడు మైళ్లదూరమున యమునానది పుట్టు చోటికి సమీపమున నొక గుహ యున్నది. ఆగుహాయందు బకుఁ డను రాక్షసుఁ డున్నాడు. వాఁడు చాల కాలమునుండి, పురుషుఁడని కాని, స్త్రీ యని కాని, పిన్న యని కాని, పెద్దయనికాని భేద మేమియుఁ జూడక, దొరికినవారి నందఱను మ్రింగుచుండెడివాఁడు. వానిదెబ్బకు మా రాజు కూడ భయపడి యేమియుఁ జేయఁ జాలఁ డయ్యెను. అట్లుండ నారాక్షసుని యొద్దకుఁ గొందఱు పౌరులు వెళ్ళి యొక యొడంబడిక చేసికొని వచ్చిరి. దానిని బట్టి పౌరు లిలువరుస ప్రకారము పుట్టెడు బియ్యపుటన్నము, దానికి దగినపప్పు, పులుసును, ముప్పది గుమ్మడికాయలు, నాలుగు కడవల నెయ్యి, ఎనిమిది

కడవల పెరుగు, పదికడవల కల్లు, మొదలగు తినుబండము లను బండిమీఁదఁ బెట్టి బండిని రెండు పెద్ద దున్నపోతులచే లాగించుకొని యొకమనుష్యుఁడు పోవునట్లును, ఆయన్నము దు న్నపోతులు, మనుష్యుఁడు వానికాహారమగునట్లును, అందునకు బదులు బకాసురుఁడు నగరమును క్రూరజంతువుల నుండియు చోరులనుండియు శత్రురాజుల నుండియుఁ గాపాడునట్లును నిష్కర్ష యయ్యెను. ఇది జరిగి యిప్పటికి పదుమూఁడు సం వత్సరములయినది. ఈ పదుమూఁడేండ్లనుండియుఁ బ్రతిదిన మొక మనుష్యుని రెండు దున్నపోతులను దిని యీ బకాసు రుఁడు చియ్యవట్టి యున్నాఁడు. మా పురజనుల యదృష్టము చొప్పున నేఁటికి మీ కుమారుఁడు వచ్చి మాకష్టమును బోఁ గొట్టనున్నాఁడు" అని చెప్పి యాబ్రాహ్మణుఁడు భీముని యొద్దకు వెళ్లి యాతనింజూచి 'బాలుడా! ఏమికావలయు' నని యడుగ 'బ్రాహ్మణోత్తమా, నాకు కడుపునిండ నన్న ముఁ బెట్టుఁడు. నా కంతియే చాలును' అని చెప్పఁగా బ్రాహ్మణుఁ డింటికివెళ్ళి యతని బంధువులకును స్నేహితు లకును జెప్ప, వారందఱు భీమునకు విందుచేయుటకుఁ బ్రయ త్నించుచుండిరి. సాయంకాలమాయెను. కావలసినంతయన్నము వండిరి. అప్పడములు గారెలు బూరెలు దోసెలు ఫేణీలు లడ్డు జిలేబి మొదలగు భక్ష్యములు, చిత్రాన్నము, పొంగలి మొద లగు బహువిధాన్నములఁ జేయించి భీమునకు భోజన మిడిరి. భీముఁడు లేకలేక యాదినము భోజనము తృప్తిగాఁ జేసి రాత్రి సుఖనిద్రపోయి మఱునాఁడు ప్రొద్దున నన్లే భుజించి, పుట్టెఁ డన్నమును దానికిఁ దగిన యితరపదార్థములను, బండిమీఁద

వేయించుకొని బయలుదేఱెను. ఈసంగతులన్నియుఁ దెలిసిన జనులు గుంపులుగుంపులుగా బండివెంటఁజనుచు, ఊరుదాటిన తరువాత రాక్షసునివలన భయఁపడి మరలి, వారివారి యిండ్లకు వెళ్ళి యేమగునో చూతమనుచుఁ గాచుకొనియుండిరి.

భీముఁడు బయలుదేరునప్పటికే కొంతయాలస్య మయ్యెను. బకాసురునితిండివేళమీఱియుండెను. బకుఁడందుచేతఁదనగుహ వదలి బయిటికివచ్చి "ఇంతయాలస్యమున కేమికారణము? ఏకచక్రపురవాసులకుఁ బొగరెక్కి నన్ను మఱచిరికాఁబోలు!" అని కోపపడుచు నొకకొండనెక్కి దారివైపుఁ జూచుచుండెను.

ప్రొద్దున భోజనముచేసియుండుటచేత భీమున కాఁకలి లేదు. కావున నగరమువదలి యమునానదిగట్టున మెల్లఁగా బండితోలుకొనుచు వచ్చుచుండెను. కొంతసేపటికి బకుని గుహదగ్గఱనుండు రెండు చెట్లగపడెను. భీముఁడంతట బండి మీఁద నిలుచుండి చూచునుగదా కొండమీఁద పికారస్వ రూపముతో బకుఁడగనఁబడెను. చెట్లనొద్ద నెముకలు గుట్టలు గుట్టలుగాఁ బడి యుండుటయుఁ జుట్టుప్రక్కల నక్కలు గ్రద్దలు తిరుగుచుండుటయుఁ గాంచెను. కొంచెము దూరము వెళ్ళునరికి 'ఘుప్పు'మని దుర్గంధమువచ్చెను. భీముఁడు తత్క్ష ణమే బండినిలిపి యమునలోదిగి కాలుసేతులు గడుగుకొని తనవీఁపు బకునివైపునకుఁ ద్రిప్పి బండిలోఁగూర్చుండి బండి యందుండు నన్నపురాశికిఁ బరిషేచనముచేసి, పెద్దగుమ్మడికా యలంత కబళములు చేసి నోటవేసికొని గుటుక్కునమ్రింగుచు మెల్లమెల్లఁగా బండినినడిపించుచుండెను. అప్పటికి దాదాఁపు రెండుగంటలయ్యెను. బకునకాఁకలి యటుండఁగాఁ దనకన్నుల




బకాసురుఁడు భీముని చెట్టుతోఁ గొట్టబోవుట.

యెదుటఁ దనవై పునకు వీఁపు త్రిప్పి బండిలోని యన్నము నంతయు భీముఁడు తినుచుండుటఁజూచి సహింపలేక ముందు నకు నచ్చి భీముని వీఁపుమీఁద నొక గ్రుద్దు గ్రుద్దెను. "భళీ బాగుగానున్నది. ఇంకొక కబళము వెళ్లఁగల దిప్పు" డని బకుని పాటింపక, మఱియొక కబళము నోటిలో వేసికొనెను. ఇంతలో రెండవ గ్రుద్దుపడెను. "వహావ్వా! మఱియు బాగు. అన్నము త్వరగాఁ గడుపులోపలికిఁ బోయినది" అనుచు నిం కొకముద్ద వేయుచుండెను. బకునికిఁ గడుపుమండి, ప్రక్క నుండు నొకచెట్టును బెఱికికొనివచ్చి భీముని వీఁపుమీఁద నొకమోదు మోదఁబోయెను. అంతలో భీముఁ డాచెట్టును నెడమచేత బిగియఁబట్టి, దానిని గుంజి యెప్పటివలె భోజనము సేయుచుండెను. బకుఁడు మఱియొక చెట్టును బెల్లగించి తెచ్చెను. భీముఁ డింతలో బండిలోని యన్నము నంతయుఁ దిని, యందుండిన కడవల పెరుగును గుటగుట త్రావి, కడుపు నిమురుకొనుచు, యమునానదిలో దిగి కాలుసేతులు కడిగి కొని, చిఱుత్రేఁపులు త్రేఁపుచు, బండియొద్దకు వచ్చి దానికిఁ గట్టియున్న దున్నపోతులను రెంటిని విడిపించి, బండిని బై కెత్తి వెనుకకుఁ బడవేసెను. అందుచేత బండిలో నున్న నాలుగుమెతుకులుగూడఁ గ్రిందఁ బడెను. కుండ లన్నియు బ్రద్దలయ్యెను. "ఏకచక్రనగరవాసులెంత మంచివారు. వారి కడుపు చల్లగాను! నాకాఁకలి నీపూఁటకుదీర్చి" రని చిఱునవ్వు నవ్వుచు భీముఁడు బకుని సమీపించెను. బకుని యాగ్రహము నకు మితిలేదయ్యెను. కావునఁ జుట్టుప్రక్కలందుండు వృక్షము లను బెఱికివానితో భీమునిఁ గొట్టవచ్చెను. భీమున కాగ్రహ

మతిశయమయి నీపొగ రడంగించెద నని చెట్లను బెల్లగించి యుద్ధమునకుఁ బూనెను.

> ఉ. ఇంచుక యేని పాపమున కెన్నఁడు రోయక, యెల్లవారి బా
> ధించి, మనుష్యమాంసములు దించుచు గ్రొవ్వితి, వానినెల్లఁ గ్ర
> క్కించెద, నీదుసాంధ్య ముడిగించెద, నిప్పుడకాలు ప్రోలి కేఁ
> గించెదఁ, జక్కనైనిలుము గిట్టిరణంబున రాక్షసాధమా!

సమీపమున నుండినచెట్లన్నియుఁ బాడయ్యెను. పిదప వాళ్ళు నొకరిమీఁద నొకరు ఉవ్విరి. వాళ్ళన్నియు నుగ్గయ్యెను. తరువాత ముష్టియుద్ధమునకు దిగి యొకరినొకరు పొడుచుచుఁ దన్నుచుఁ గ్రిందుమీఁదునయి పెనఁగులాడిరి. ఇందుచేత నా ప్రదేశమునందలి ముండ్లపొదలు మొదలగునవి నలిగిపోయి దిమ్మిసచేసినట్లు నేల గట్టిపడెను. రోషద్వేషము లంతకంతకు నెక్కువయ్యెను. యుద్ధము ఘోరమయ్యెను. కడపట భీముఁడు బకునిఁబట్టి భయంకరముగా నేలమీఁదఁగొట్టెను. బకుఁడు నోట నెత్తురు గ్రక్కుచు బిగ్గఱగా గేకవేసి నేలఁబడి చచ్చెను. అంతట బకుని కొడుకులు వానిసంతతివారు భయపడివచ్చి, భీమునకు వందనము లొనర్చి రక్షింపుఁ" డని వేఁడఁగా మంచిది మీఁదిక నెన్నటికిని మనుష్యులఁ జంపకుఁడు" అని కట్టుదిట్టము చేసి, బకునికళేబరము నీడ్చుకొని యేకచక్రపురము కోటవాకిలియొద్దఁ బడవేసి, భీముఁడు పురములోనికి వెళ్లెను. పురజనులందఱు బకుని కళేబరమునుజూచి భయఁపడుచు దుర్మార్గుఁడు చచ్చెఁగదా యని సంతసించిరి. బకుని వధించిన ధీరుఁడగు భీమునిసందర్శనము సేయుటకై ప్రజలందఱు తిరునాళ్లకు వెళ్లునట్లు వెళ్లుచుండిరి.

ఉ. "వీఁడొక మంత్రసిద్ధుఁడగు విప్రుఁ డసాధ్య బలుణ్ బకాసురుణ్
నేఁ డనిఁ జంపెనట్టె! యితనిం జని చూతము" యంచుఁ జెచ్చెరం
బోఁడిగ వేత్రకీయమున భూసురులాదిగ వచ్చిచూచి ర
వ్వాఁడిమగంటిమిణ్ వెలయువాని వృకోదరు నెల్లవారలణ్

7. భీముని వివాహము.

పాండవేయు లిట్లు బ్రాహ్మణవేషము వేసికొని వేదాధ్యయనముఁ జేయుచు సత్పురుషులనియు విద్యాధికులనియుఁ బేరుపొంది బిచ్చమెత్తుకొని జీవించుచు నేకచక్రపురంబున నా బ్రాహ్మణునింట నుండిరి.

ఇట్లుండ నొకనాఁ డొక బ్రాహ్మణుఁడు, నా రుండిన బ్రాహ్మణు నింటి కతిథిగా వచ్చెను. ఆతనికిఁ దగినసపర్యలా చేసిరి. భోజన మయినతరువాత నందఱొక-చోటఁ జేరి యిష్టాగోష్ఠిమాట లాడుచు "అయ్యా! మీ రెక్కడినుండివచ్చితిరి? మీ రేయేదేశములు చూచితిరి? ఏదేశములు రమ్యములు చెప్పుఁ"డని ధర్మరాజడుగ నాబ్రాహ్మణుఁడిట్లనియె. "అయ్యా! నేనుచూడని దేశము లేదనియే చెప్పవచ్చును. కాని ద్రుపదరాజు వంటిరాజుగాని, పాంచాలదేశమువంటి దేశముఁగాని, నే నెన్నఁడును జూచియుండలేదు. అచటిబ్రాహ్మణభక్తియు, న్యాయ్యమునం దనురక్తియు, నేను మఱియొక-చోట గాంచినవాఁడను గాను. ఈద్రుపదరాజు యజ్ఞముచేసి కృష్ణయనుకూఁతును ధృష్టద్యుమ్నుఁ డనుకొడుకునుఁ గనెను. కృష్ణవంటి సౌందర్యము గల రాజకన్య ప్రపంచమునలేదని చెప్పుకొనుట వింటిని. ఆమె స్వయంవరమిపుడు జరుగనున్నదఁట! అందులకై రాజకుమారు

లెండటఁ పాంచాల దేశమునకు వెళ్లుచున్నారు" అని చెప్పెను. ఆమాటలు పాండవేయులు విని సంతసించిరి. కొడుకులయభిమత మెఱింగిన కుంతి 'ధర్మరాజా! మనమిచటికివచ్చి చాలకాలమయి నది. ఎన్నిదినము లొకరియింటనుండనగును? అదిగాక పాంచాలదేశమురాజు మిక్కిలి ధార్మికుఁడుఁట. మన మచటికేగుదము' అని వారితోఁజెప్పి తమరున్న యింటి బ్రాహ్మణీ బ్రాహ్మణుల సెలవుతీసికొని, బయలుదేఱి ద్రుపదరాజు పురముసొచ్చి, అం దొక కుమ్మరివానియింటియందు బసచేసి, బ్రాహ్మణవేషమున రహస్యముగ నుండిరి.

ద్రుపదరాజు పుత్రకామేష్టి చేసినపు డర్జునునకు భార్య గాఁగల కొమార్తెను వరముగాఁగోరి యుండెను. అందుచేత వచ్చినరాజులలో నర్జునుని వెదకి యాతని నెందునుంగానక "ఈవింట బాణములు సంధించి యైదుబాణములచేత మత్స్య యంత్రము నెవ్వఁడు కొట్టఁగలఁడో వానికి, నాకూఁతునిచ్చెద" నని పట్టణమంతటను, చాటింపు చేయించెను.

తనపురంబునకువచ్చిన రాజలోకంబునకుఁదగిన యాదర మునుజూపి బ్రాహ్మణుల భూరిదక్షిణలచేతను, సంతర్పణల చేతను, ద్రుపదరాజు సంతృప్తులం జేసెను.

స్వయంవరసభకు రాజులందఱు విచ్చేసి యుచితాసన ములఁ గూర్చుండిరి. బ్రాహ్మణులు వేదాధ్యయనము సేయుచు సభామంటపమునఁ గిక్కిఱిసిరి. సర్వాంగసుందరియగు ద్రుపద రాజపుత్రి, జయజయ ధ్వనులు మ్రోయుచుండ, సభా భవనంబున కేతెంచి యొకపీఠముపై నిలిచెను. ఆమె యందచ మును జూచి రాజులందఱు నానందపరవశు లయిరి. సభా

మధ్యమున మత్స్యయంత్ర మమర్పఁబడి యుండె. ప్రక్కన విల్లును నమ్ములును సిద్ధముగ నుండెను. ధృష్టద్యుమ్నుఁడు రాజుల నెల్లరను గలయఁజూచి "క్షత్రియవరులారా! ఈ ధనువును వంచి, యీ యమ్ములను సంధించి, మత్స్యయంత్రమునై దు బాణములఁ బడఁగొట్టువానికి, నా సోదరి నిచ్చెదను" అని చెప్పి ప్రక్కకుఁ జనెను. రాజు లొకరొకరుగా నమ్ములను దీసికొని ప్రయత్నించిరి. కొందఱు వింటిని వంచిరి; కాని యమ్ములను దొడుగఁ జాలకపోయిరి. కొందఱు రెంటిని చేయఁ గలిగినను లక్ష్యమును గొట్టలేకపోయిరి. దీనిం జూచి కొందఱు రాజులు మాట లాడకుండఁ దలవంచుకొని యావలకు వెళ్లిపోయిరి. రాజలోకము తెల్లఁబోయెను. ఇట్లుండ బ్రాహ్మణులనడుమనుండి యొకఁడు బయలుదేఱి, ముందునకు వచ్చి, వింటిని చేతఁబట్టి, ధనుష్టంకారముసేసి మొదటి యంబుచేతనే మత్స్యయంత్రమును నేలఁబడ నేసెను. జనులందఱు చప్పటలు కొట్టిరి. బ్రాహ్మణు లందఱును దమ యుత్తరీయములఁ బై కెగుర వేసిరి. జయదుందుభులు మ్రోఁగుచుండ ద్రుపదరాజనందన యగుకృష్ణ, తన చేతనుండు పూలహారమును, బ్రాహ్మణవేషమున నుండు నర్జునుని మెడలో వేసెను. దేవతలు పూవులవానఁ గురిపించిరి. అర్జునుఁడు ముందునడువ, స్త్రీరత్న మగుద్రౌపది యాతనివెంట వారిబసకు నడిచెను. ఇట్లు తమయెదుట రాజుల నందఱునువదలి, యొక బీదబ్రాహ్మణునివెంట సుందరి యగుద్రౌపది వెళ్లుటఁజూచి రాజుల కాగ్రహము గలిగెను. అందుచేత వారంద ఱేకమై "ద్రుపద మహారాజు మమ్ముఁ బిలిపించి యవమానపఱచెను. స్వయం

వరము రాజుల ధర్మముకాని బ్రాహ్మణులకుఁ దగదు. కాఁబట్టి ద్రౌపది మాలో నొకరిని వివాహ మాడవలయును గాని బ్రాహ్మణుని చేఁ బట్టఁగూడదు. అట్లు చేయుటకు నిష్టపడ దేని ద్రౌపదిని గాల్చివేయుదుము. మనల నవమాన పఱచినందులకు ద్రుపదరాజును జంపుదుము" అని య్యాగ్రహారవములుసేయుచు మత్స్యయంత్రమును గ్రిందఁ బడఁద్రోయఁ జాలకపోయినను, గత్తులు కఠారులుదూసికొని ద్రుపదరాజుమీఁదికిఁ బరుగెత్తిరి. ఈయల్లకల్లోలము నాఁపు యోజనతో ద్రుపదుఁడు బ్రాహ్మణులచాటునకు వెళ్ళెను. రాజు తమ శరణుఁ జొచ్చెనని తలఁచి తమకృష్ణాజినములం బైకెత్తి యుద్ధము సేయువారివలె బ్రాహ్మణులు నిలిచిరి. భీమార్జునులు దీనింజూచి నవ్వి "వెఱవకుఁడు. మిమ్మందఱను రక్షించెద" మని చెప్పిరి. వింటిని చేతఁ బట్టుకొని యమ్ములు సంధించి యర్జునుఁడు నిలువఁబడెను. ప్రక్కనుండిన వృక్షము నొకదానిని పెకలించికొని భీముఁడు తోడయ్యెను. వీరికిని రాజకోటికిని యుద్ధము జరిగెను. కాని రాజులు వీరిద్దఱయెదుట నిలునఁజాలకపోయిరి. పిమ్మటఁ దన కుమారువలన నీబ్రాహ్మణవీరులు పాండవులే యని ద్రుపదుఁడు తెలిసికొని, ద్రౌపదిని వ్యాసునాజ్ఞ ప్రకారము పంచపాండవుల కిచ్చి మిక్కిలి వైభవముతోఁ బెండ్లిచేసెను. పాండవులందఱు ద్రుపదునియింట సుఖముగానుండిరి. ద్రుపదుఁడు శత్రువుల వలన భయములేక హాయిగానుండెను.

## 8. పాండవుల రాజసూయయాగము, జరాసంధునివధ.

పాంచాలదేశంబున ద్రుపదరాజు నొద్దఁ బాండవులు సుఖంబున నున్నారని దుర్యోధనాదులు విని "ఓహో!

మోసము వచ్చినదే. ద్రుపదరాజు మిక్కిలి బలవంతుఁడు. అతనికి బలపరాక్రమవంతుఁడగు కుమారుఁడు ధృష్టద్యుమ్నుఁడు గలఁడు. ద్రుపదునకుఁ బాండుసుతు లల్లుండ్రయిరి. పాండవు లన్నఁ గృష్ణబలరాములకుఁ బ్రేమ. వీ రందఱొక్కటైన యెడల మనరాజ్యము నిలుచునా? మనము బ్రతుకఁగలమా? ప్రపంచములోని యేరాజ్య మింక నిలువఁగలదు? కావున నెట్లయినను ద్రుపదరాజునకును బాండవేయులకును విరోధము గల్పింప వలయు" నని తలఁచి, తండ్రి యగు ధృతరాష్ట్రునితో యోజించిరి. ధృతరాష్ట్రుఁడు భీష్మవిదురులనుబిలిపించి మాటలాడెను కాని వారాకుయుక్తులు పనికిరావనియుఁ బాండవులను బిలిపించి, వారికి గౌరవముగ రాజ్యములో నర్థభాగమియ్య వలయుననియు, నొక్కిచెప్పిరి. ఆమాటలకు దుర్యోధనాదులు మారాడలేక యూరకుండిరి. విదురుని ద్రుపదపురమునకుఁ బంపి ద్రౌపదీసహితముగఁ బాండవులను బిలిపించి, యర్థ రాజ్యమిచ్చి ఖాండవప్రస్థమునకుఁ బాండవులను బంపివేసిరి. పాండవు లింద్రప్రస్థమను నగరమును నిర్మించి, యందుండి రాజ్యమును బాలించుచుండిరి. ఖాండవవనదహనకాలమున నర్జునిచేఁ గాపాడఁబడిన మయుఁడు వచ్చి, ధర్మరాజును దర్శించి, యొకసభాభవనమును నిర్మించి యిచ్చెదనని, పదునాలుగు మాసములలో నాసభ పూర్తిచేసి తెచ్చెను. భీమునకు గదను అర్జునునకు శంఖమును బహుమతిగానిచ్చెను. పిమ్మట నారద మహామునిచేత బోధింపఁబడిన ప్రకారము, ధర్మరాజు రాజసూయయాగముచేయఁ దలంచి, కృష్ణానుమతుఁడై శత్రురాజుల నందఱను జయింప భీమార్జునులను బంపెను.

ఆకాలమున బృహద్రథుఁడను రాజుమిక్కిలిసుగుణములు గలిగి న్యాయమార్గమున మగధదేశమును బాలించుచు, గిరివ్రజ మనుపట్టణమును దనకు రాజధానిగాఁ జేసికొని యుండెను. కాశీరాజు కూఁతుల నిద్దఱ నితఁడు పెండ్లియాడి సుఖంబున నుండెను. కాని బిడ్డలు లేకుండుటచేత విసుగుఁ జెంది రాజ్యమును వదలి, తపంబునకై యడవులకు భార్యలతో వెళ్ళెను. అచటఁ జండకౌశికుఁడను మునియొక్క మాహాత్మ్యమును విని, యొకనాఁ డతఁడు మామిడిచెట్టుక్రిందఁ గూర్చుండి యున్నపు డాతని సందర్శించి, యాదంపతులు తగిన యుపచారములు చేయుచుండిరి. అందుల కతఁడు మిక్కిలి సంతోషించి వరముగోరుమని యడుగ "అయ్యా! నాకు ముసలితనము దాపరించినది. 'అపుత్రస్యగతిర్నాస్తి' అనువచనము బాధించుచున్నది. పుత్రులు లేనివారికి నరకముతప్పదు గదాయని భార్యలతోడఁ దపించుచున్నవాఁడ. కావున నాకొక సుపుత్రుఁ డుద్భవింప వరము దయసేయుఁడు" అని ప్రార్థించెను.

ఉ. సంతత మైనసర్వ సుఖసంపద గల్గియుఁ, దానికిం దగన్
సంతతి లేమిఁజేసి యది సర్వము హేయము కాఁ దలంచి, ని
శ్చింతుఁడనై ధృతిం దపము సేయఁగ వచ్చితిఁ; బుత్త్రిజన్మమై
సంతన యేను మీ దయఁ గృతార్థతఁ బొందుదు సన్మునీశ్వరా!

అప్పు డాకస్మికముగ మామిడిచెట్టునుండి యొకపండు చండకౌశికునియొడిలోఁ బడెను. దాని నతఁ డభిమంత్రించి రాజున కియ్య, రాజు దానిని రెండు సమభాగములుగఁ జేసి భార్యల కిద్దఱకును, జెఱియొక ముక్కనిచ్చెను. వా రిరువురు గర్భవతులై పదినెలలకు విచిత్రముగాఁ జెఱియొకసగముబిడ్డను

ప్రసవించిరి. ఆముక్కలను రాజునకుఁ జూపుటకు సిగ్గుపడి, దాదులచేత నాఁరెంటి నూరివెలుపలఁ బాఱ వేయించిరి. ఆయూరివెలుపల సంచరించుచుండిన జర యను రాక్షసి, యాహారముకొఱకు వెదకుచు వచ్చి, యా రెండు ముక్క లను దీసికొని, యెత్తుకొన సులువుగానుండుటకై యొకటిగాఁ గలిపి యదిమెను. తత్క్షణ మవి రెండును నతుకుకొనెను. బిడ్డడు గట్టిగా నేడ్వసాగెను. ఈశబ్దము విని జనులు వచ్చిరి. జర యారాజు నాశ్రయించుకొని యుండునది గనుక, ఆ బిడ్డను రాజున కిచ్చి వేసెను. జరచేత సంధింపఁబడిన కారణము చేత జరాసంధుఁడని యాబాలునికిఁ బేరు పెట్టిరి.

జరాసంధుఁడు పెద్దవాఁడయి మిక్కిలి బలవంతుఁ డనిపించుకొని, తండ్రి పోయిన తరువాత రాజుల నెందఱనో జయించి, తనయిష్టదేవతకు బలిగా నిచ్చుటకై, వారిని చెర యందుంచి యుండెను. ఇట్టి జరాసంధునిమీఁదికిఁ గృష్ణభీమా ర్జునులు బ్రాహ్మణవేషమున వెళ్ళి, వానియింటిలోఁ బ్రవే శించి యాతని యుద్ధమునకుఁ బురికొల్పిరి. జరాసంధుడు భీము నితో మల్లయుద్ధము చేయుటకొప్పుకొనెను. అంతట వారిద్దఱు భుజము లప్పళించుచు యుద్ధమునకుఁ బూనిరి. వీర లెన్నియో పట్లుపట్టి పెనఁగుచుండిరి. ఆయుద్ధమును జూచుట కెందఱో గిరివ్రజపురవాసులు మూఁగిరి. ఇట్లు యుద్ధముచేసి కొంత కాలమునకు జరాసంధుని కలసటఁ గలిగించి వాని నేలఁ బడ వైచి, యొక కాలిమీఁదఁ దన పాదమునుంచి మఱియొక కాలిని జేతఁ బట్టుకొని, బొంగును జీల్చినట్లు రెండు భాగములుగా నెన్ని మాఱులు జీల్చివేసినను దత్క్షణ మా




భీముఁడు జరాసంధునిఁ జంపుట.

తునుకలు మరల నేకమయి, జరాసంధుఁ డెప్పటియట్లయుద్ధము చేయ మొదలు పెట్టుచుండెను. ఇట్లన్నిమారులు చేసినను జరాసంధుఁడు చావకుండుటఁగని, భీముఁడు విసిగి కృష్ణుని వైపుఁజూచెను. ఆతఁ డొకపుల్లను జీల్చి యా చీలికను వ్యత్యస్తముగాఁ బడవేసెను. భీముఁ డద్దానిం గ్రహించి జరాసంధుని మరలఁ గ్రిందఁబడఁద్రోసి, యెప్పటివలెఁ గాలుఁ బట్టుకొని రెండుచీలికలు చేసి, వాని నట్లుంచక తక్షణమే వ్యత్యస్తముగాఁ ద్రిప్పిపాఱవైచెను. అంతటితో జరాసంధుఁడు చచ్చెను. పిమ్మట కారాగృహమునఁ గృశించుచుండిన రాజులవిడిపించి వారలసన్మానించిపంపి జరాసంధునికొడుకగు సహదేవునికిఁ బట్టముగట్టి, ధర్మరాజుచేయు రాజసూయయాగమున కాతని రమ్మనిపిలిచి కృష్ణ భీమార్జును లింద్రప్రస్థమున కరిగిరి. జరాసంధుని మరణము విని ధర్మజుని సామ్రాజ్యము పూజ్యమయ్యెనని జనులానందమందిరి.

మ. జనసంత్రాసకరున్ బలోద్ధతు జరాసంధున్ మదాంధున్ రణం
బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు, భూభుగ్వితులం దన్నిరో
ధుల నిర్ముక్తులఁ జేసె నింకఁ జతురంతక్షోణికిన్ ధర్మనం
దను సామ్రాజ్యము పూజ్యమయ్యెనని మోదం బందిరుర్వీజనుల్.

అనంతరము ధర్మరాజు తమ్ములను బిలిచి, దిగ్విజయ మొనర్చి రండని చెప్పి యుత్తరమున కర్జునుని, దక్షిణమునకు సహదేవుని, బడమటికి నకులుని, దూర్పునకు భీమునిఁ బంపి వేసెను. అర్జునుఁ డుత్తరమున హిమాలయమువఱకు నుండు రాజుల నందఱజయించి వారియొద్దఁగప్పములఁ గొనిపురమునకు

వచ్చెను. భీముఁడు తూర్పుభాగము నంతను జయించి కాను కలు తెచ్చెను. మిగిలినవారందఱు జయముపొంది వచ్చిరి.

పిమ్మట రాజసూయ యాగము చేయుటకుఁ దగిన ప్రయత్నములు చేసిరి. కృష్ణుఁడు వచ్చి ధర్మరాజును దీక్షఁ బూనుమనుటచేత ధర్మరాజట్లు చేసెను. రాజులందఱు వచ్చి ధన మవ్వారిగా ధర్మరాజునకు సమర్పించిరి. వారిచేత నము నంతవఱకు యాగపుఁ బనులందు సాయము చేయుచుండిరి. లక్షలకొలఁది బ్రాహ్మణులు సకుటుంబులై వచ్చిరి. వారికి సంతర్పణలు విరామము లేక జరుగుచుండెను. బ్రాహ్మణు లకును బీదలకును దక్షిణలుయథేచ్ఛముగనిచ్చి తృప్తి పఱచిరి. రాజు లిట్లు చేయుటచేత, జనులు దారిద్ర్యమును బోఁగొట్టి బీదవారలక్షేమ మారయుచుఁ, బ్రజలబాగె తమబాగని చూపుచుండిరి. కావనే ధర్మరాజుగారిపాలనతో క్షామములు గాని, ఈతిబాధలుగాని లేక దేశమంతయు సుభిక్షముగా నుం డెను. అందుచేత తనవారు, పెరవారను పక్షపాత మించు కైనను లేక ధర్మరాజువలె దుష్టులను శిక్షించి శిష్టులను బాలిం చిన రాజు మఱియొకఁడు లేఁడని జనులుచెప్పుకొనుచున్నారు.

## 9. పాండవు లరణ్యావాసమునకుఁ బోవుట.

రాజసూయ యాగమయిన తరువాత, రాజులందఱు గూడ నట్లేచేసిరి. ధర్మరాజునకుండు గౌరవమును, అతనికిఁ గల పలుకుబడిని, ఆతని సంపదనుజూచి, దుర్యోధనుఁడసూయ గలవాఁడయి, యెట్లులనయినను బాండవులసంపద నపహరింప వలయునని యోజించుచుండి, తానును నొక సభాభవనమును

నిర్మింపఁజేసి, దానిని వీక్షించుటకై పాండవులను హస్తినాపురంబునకు రప్పించెను. ధర్మరాజా సభను జూచుచుండఁగా దుర్యోధనుఁ డా యమాయకుని జూదమునకుఁ బురికొల్పి, తన మేనమామ యగు శకునితో జూదమాడునట్లు చేసెను. కాలవశమున ధర్మరాజు సర్వమునోడిపోయి, తమ్ములను దన్నుఁ బిదప ద్రౌపదినిఁ గూడ జూదమునఁ బోఁగొట్టుకొనెను. అప్పుడు దుర్యోధనుడు ద్రౌపదిని సభకుఁ బిలిపించెను. ఇతని తమ్ముఁడగు దుశ్శాసనుఁ డామె తలవెంట్రుకలుపట్టి యీడ్చి ఆమెకట్టియుండు బట్టను విప్ప మొదలుపెట్టెను. కాని దైవబలముచేత నామెబట్ట తఱుఁగక లాగినకొలది వచ్చుచుండెను. అచట నిలిచియుండిన భీముఁడా యమానుషకార్యమునకు కోసి తనకోపము పట్టఁజాలక "ద్రౌపది నిట్లవమానపఱచిన యీదుశ్శాసనుని జీల్చి రక్తము త్రాగెద"నని శపథము చేసెను.

మ॥ కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ చూచుచుండన్ మహో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైల రక్తౌఘని
ర్ఝర ముర్వీపతి చూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

'నాతొడమీఁద గూర్చుండు' మను సంజ్ఞగా ద్రౌపదిని జూచి దుర్యోధనుఁడు తనతొడను దట్టఁ దొడలు విఱుగఁగొట్టి యా వెచ్చనినెత్తుట ద్రౌపదికురుల చిక్కుడలించెద'నని యాసమయమున భీముఁడు ప్రతిజ్ఞ చేసెను.

ఉ॥ ధారుణిరాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁజూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యద్దురాత్ము దు

ద్వారమదీయ బాహుపరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

కొమారులయందుఁ బక్షపాతముగల ధృతరాష్ట్రుఁడు, పాండవులను హస్తినాపురమునకుఁ బంపి, కుమారుల దుర్బోధనలు విని పాండవులను మరలఁ బిలిపించి ధర్మరాజుచేతఁ బందెము వేయించి, శకునిచేత జూద మాడించి, పాండవులను బండ్రెండు సంవత్సరము లడవులలో నుండునట్లును, పదమూఁడవ సంవత్సరమున నెవ్వరికిని దెలియకుండ నజ్ఞాతవాసము చేయునట్లును, నొప్పించి వారినడవులకుఁబంపివేసెను. దుర్యోధనాదు లమితమైన యానందముఁబొందిరి. ప్రజలు మాత్రము ధర్మాత్ములగు పాండవు లరణ్యావాసమునకుఁ బోవుచున్నారని మిక్కిలి దుఃఖపడి వారివెంట బయలుదేరిరి కాని, అట్లు చేయుట మంచిది కాదని చెప్పి ధర్మరాజు కొందఱ వెనుకకుఁ బంపివేసెను. కొందఱు మాత్రము ధర్మరాజును విడువక యాతని వెంట నేగుచుండిరి.

## 10. హనుమంతుఁడు భీమున కగపడుట.

పాండవులు ద్రౌపదీసహితులై బంధుమిత్రాదులతోఁ గూడ మహామునులదర్శనము చేయుచు నరణ్యములోఁ గాలము గడుపు చుండిరి. కొంతకాల మయిన తరువాత రోమశుఁ డనుముని వచ్చి తీర్థయాత్రలు చేయుఁడని వారికి బోధింప, వారు గంధమాదనపర్వతమునుండి గంగానది పుట్టు చోటున నుండు బదరీ నారాయణాశ్రమమునకుఁ బోవఁ దలఁచిరి కాని, ద్రౌపతి నడువఁజాలక మూర్ఛ వోవుచుండుట

చేత, భీముఁడు తనకొడుకగు ఘటోత్కచుని మనంబునఁ దలఁచెను. తత్క్షణ మాతఁడు తనపరివారముతో భీముని యెదుట నిలిచి, తన్నుఁబిలిచినకారణము దెలిసికొని, పాండవులను ద్రౌపదిని తనమీఁదఁనెక్కించుకొని బదరికాశ్రమమునకుఁబోయెను.

భీముఁడును ద్రౌపదియు నొకచోట విహరించుచుండ, నాకాశమునుండి వేయిఱేకులు గలిగి ముద్దులు మూటఁగట్టుచుండు తామర పువ్వొకటి క్రిందఁబడెను. ద్రౌపది దానింజూచి, అంతమంచిసువాసనగల పువ్వులను మఱికొన్నిఁటి దెచ్చిపెట్టుఁడని భీముని బ్రార్థింపఁగాఁ తత్క్షణ మాతఁడు తన గదను జేతఁబట్టుకొని గాలి కెదురుగా నడుచుచు, నరణ్యము ప్రవేశించి సింహనాదముచేయ, నాశబ్దమునకు బెదరి తన దారిని వచ్చిన జంతువుల సంహరించుచుఁ బోయి, తనదారి కడ్డముగఁ దోకను జాఁపుకొని కొండవలెఁ బరుండి యుండు గొప్పవానరు నొకనిఁ జూచి, యాతని నిద్రనుండి లేపఁదలఁచి బిగ్గరగా సింహనాదంబుసేసెను. ఆశబ్దమునకు హనుమంతుఁడు కన్నులల్లన విచ్చి "అయ్యా! అడవులలో సంచరించు మా వంటి జంతువులకు, న్యాయాన్యాయభేదము దెలియక పో వచ్చునుగాని, ఉత్తమ మనుష్యజన్మమెత్తిన మీవంటి వారి కింత మాత్రము తెలియకుండునా? జబ్బుచే బాధపడుచుఁ గదల మెదల నేరకపడి నిద్రించుచుండిన నాయట్టి ముసలివాని నిద్రకు భంగము గలిగించుట న్యాయ్యమా? అయ్యా! నీ వెవ్వఁడవు? మనుష్యుల కగోచరంబగు నీ యరణ్యంబున కెందులకు వచ్చితివి? అమృతమువలెఁ దివ్యమైయుండు నీ చెట్ల ఫలములు తిని యీవనముఁ గడచి వెళ్లుము. స్నేహాభావ

మాతోఁ జెప్పితిని గాని మఱియొక విధముగాఁదలఁపకు" మని చెప్ప "అయ్యా! నేను వాయుపుత్రుఁడ నగు భీమసేనుండను ధర్మరాజు తమ్ముఁడను, మిక్కిలి బలము గలవాఁడను. ఇట్టి నాకు మీరు దారి యియ్యనియెడలఁ బూర్వము హనుమంతుఁడు సముద్రము నెట్లు కుప్పించి దాఁటెనో, అట్లు మిమ్ము దాఁటి పోయెద" నని చెప్పఁగా హనుమంతుండు చిఱునవ్వు నవ్వి "అయ్యా! నేను ముసలివాఁడను. లేవజాలను. నాఁ తోఁకఁ గదలించి యటుపెట్టి పొ"మ్మని చెప్పఁగా భీముఁడది తృణప్రాయ మని యెంచి, యెడమచేతఁ తోఁకను గదలించి చూచి యది కదలకుండుటచేతఁ దన రెండుచేతు లుపయోగించి ముక్కి ముక్కి దాని నెత్తఁజాలక సిగ్గుపడి "మహాత్మా క్షమింపుఁడు. నాగర్వ మడఁగినది. మీరు దేవతలలో నొకరుగానుండవలయు" నని నమస్కారముచేసి నిలిచెను. హనుమంతుఁడు సంతసించి తననిజరూపమును భీమునకుఁ జూపి కౌరవులతో మీరు యుద్ధము చేయునపుడు, అర్జునుని రథధ్వజముపై (జెండా) నిలిచి యతనికిఁ దోడుపడుదు నని చెప్పి మాయ మయ్యెను.

భీముఁ డటనుండి కొంత దవ్వరిగి, యెగిరిపోవుచుండు పక్షులఱెక్కలు తేమగా నుండుటను గనిపెట్టి, సమీపమున నొక సరస్సుండవలయు నని తలఁచి ముందు నడచి సౌగంధిక సరోవరమును గాంచెను. భీముఁ డందుదిగి సౌగంధిక కమలములను గోయుచుండ దాని కావలివారలు వలదని వారించినను వినక వారితో యుద్ధము చేసి పుష్పములను దెచ్చి ద్రౌపది కిచ్చెను.

## 11. జటాసురుని వధ.

ఇట్లుండఁగా జటాసురుఁ డను రాక్షసుఁడు బ్రాహ్మణ వేషముతోఁ బాండవులయొద్దకు వచ్చి వారికి సేవలుచేయుచు వారితో గలసిమెలసి కొంతకాల ముండి, భీముఁ డింటలేని సమయమున, ధర్మరాజును ద్రౌపదిని నకులుని నెత్తుకొని యాకాశమార్గమున మిక్కిలి వేగముగాఁ బరుగెత్తెను. సహ దేవుఁడు పరుగుపరుగున వెళ్ళి యడవిలో సంచరించుచుండిన భీమున కాసంగతిఁ దెలియఁజేయఁగాఁ దక్షణ మతఁడే తెంచి జటాసురునిఁ గలసికొని "ఓరీ! మా యింటనుండి మాతోఁ గలసి మెలసి భుజించుచుండి 'తిన్న యిల్లు గుద్దలించె' నన్న సామెత ప్రకారము మాకె మెగ్గు సేయుచున్నావు! బుద్ధి గలదేని మా వారిని దక్షణము దిగవిడిచి నీ ప్రాణములు రక్షించు కొనుము. అట్లు సేయవేని నిన్నుఁ బరిమార్చెద" నని భీముఁడు బెదరింపగా నతఁడు ధర్మరాజాదులను దిగ విడిచి భీమునితో యుద్ధముచేయఁ గడఁగెను. కడపట జటా సురుఁడు చచ్చెను. ధర్మరాజాదులను వెంటఁబెట్టుకొనిభీముఁడు స్వస్థానమును జేరెను.

## 12. భీముఁడు పాముచేఁ బట్టువడుట.

అనంతరము పాండవులు హిమాలయ పర్వతమును జేరి యచటి దేవర్షులు బ్రహ్మర్షులు యజ్ఞములు చేసిన ప్రదేశము లను జూచుచు నొకసంవత్సర మందుండిరి. అప్పు డొకనాడు భీముఁ డెప్పటివలె వేటకు వెళ్ళి, యచట విచ్చలవిడి తిరుగు చుండఁగా నొకకొండచిలువ వానిని పట్టుకొనెను. అతఁడు




సర్పరూపంబున నున్న నహుషుండను రాజు భీముని మ్రింగఁ జూచుట.

విశేష బలాఢ్యుఁడైనను నాపాము పట్టునుండి వదలించు కొనఁ జాలఁ డయ్యెను. "అహా! ఏమి, దైవమాయ! వెయ్యి యేనుఁగులబలము గలిగిన వాఁడ నయ్యును, పన్నగ గంధర్వ రాక్షసుల నెందఱినో నిర్జించిన వాఁడ నయ్యును, నేఁ డొక పన్నగముచేఁ బట్టువడి కదల మెదల నేరకున్నాను గదా! నా దురదృష్ట మేమని చెప్పుదును?" అని చింతించుచు నింతబలము గల యీసర్పము సామాన్యముగా నుండ దని తలఁచి "పన్నగ రాజా! నేను ధర్మరాజు తమ్ముఁడను. భీముఁ డను పేరుగల వాఁడను. యక్షరాక్షస పన్నగుల నెందఱినో జయింపఁ గల బలముగలవాఁడను. ఇట్టి నన్నుఁ బట్టుకొనఁగలిగిన శక్తి మీ కెట్లు వచ్చిన" దని యడుగ 'ఇది నాకు వరమువలన వచ్చిన, దని చెప్పి యాతని యెముకలు విఱిచి ముద్దచేసి మ్రింగఁదలఁచి తనచుట్టలను బిగించి, మ్రింగుదానివలె భీముని తలయొద్దకు సమీపించుచుండెను. భీముఁడు దీనిం జూచి "అయ్యా! నా చావునకై నేను చింతింపను. నా యన్నదమ్ములిచట నడవి యందుఁ దిరుగుచున్నారు. వారెంత దుఃఖింతురో యని వగచు చున్నా" నని చెప్పుచుండెను.

భీముఁ డింత తడవు రాకుండుట కేమి కారణం బని తలఁచి ధర్మరాజాదులు వెదకుటకై వెళ్ళిరి. ధర్మరాజు భీముఁ డుండుచోటికి వచ్చి, యజగరంబుచేఁ బట్టువడి కదల మెదలఁ జాల కున్న భీమునిం జూచి మిక్కిలి దుఃఖించి, యయ్యజగరంబున కిట్లనియె. "అయ్యా! నీవు సర్పరూపము దాల్చిన రాక్షసుడవో, దేవతవో, నే నెఱుఁగను. ఆహారార్థమె నా తమ్ముని బట్టితివేని, నీకుఁ గావలసినంత మాంసమునిచ్చెద. ఈ

నా తమ్ముని విడువు” మన నామాట లాలించి “అయ్యా! ధర్మరాజా! వినుము. నేను నహుషుఁడను రాజను. మీ పూర్వులలో నొకఁడను . ఐశ్వర్యంబున నింద్రునితో సమానుఁడ నయి గర్వంబున బ్రాహ్మణోత్తములచేత బ్రహ్మరథము పట్టించుకొని పోవుచు, వారల నవమానించుటచేత నగస్త్య మహాముని యలిగి ‘పామవై యుండుదు’ వని శపించెను. నాకంతటఁ దెలివివచ్చి భయపడి బ్రహ్మరథము డిగ్గి, అగస్త్యునకు నమస్కరించి, రక్షింపుఁ డని ప్రార్థింపఁగా దయఁదలఁచి ‘నీవు పాముగా నున్నంతకాలము నీకంటె నెక్కువ బలము గల ప్రాణులు కూడ బలహీనములై నీచేతఁ బట్టువడును. నీపూర్వజ్ఞానము నీ కుండును. నీప్రశ్నల కుత్తరము ధర్మజుఁ డెప్పుడు చెప్పునో, యప్పుడు నీకు శాపవిముక్తి యగు’ నని చెప్పెను. కావున మిమ్ము కొన్ని ప్రశ్న లడిగెదను. వానికి సరియైన యుత్తరము లిచ్చి తమ్ముని విడిపించుకొనుఁ” డని ధర్మరాజును కొన్నిప్రశ్న లడిగెను. వాని కన్నింటికి సదుత్తరము లిచ్చి ధర్మజుఁడు భీముని విడిపించుకొని పోయెను.

అనంతరము కొంతకాల మీ హిమవత్ప్రాంత ప్రదేశములందు సుఖంబుండి కృష్ణుఁడు, ఇంద్రుఁడు, మార్కండేయుఁడు, మొదలగువారితోఁ గొంతకాలము గడపి కామ్యకవనంబు వదలి, ద్వైతవనంబునకుఁ జని పాండవు లచట వాసము చేయుచుండిరి.

## 12. ఘోషయాత్ర.

పాండవేయులు ద్వైతవనంబున నుండుటఁ దెలిసికొని, కర్ణశకుని దుర్యోధను లొక రహస్యప్రదేశంబునఁ గూర్చుండి

"తినుటకుఁ దిండిగాని, కట్ట బట్టగాని లేక, బాధ పడుచుండు పాండవులయెదుట, మనము వైభవముతో సంచరించితిమేని, పాండవులు కుళ్ళి మనోవ్యాకులముచేతఁ జత్తురుగదా. సాటిలేని సౌభాగ్యము ననుభవించు నీ దేవులయొక్క పదవిఁ జూచి, 'అయ్యో పాండవులను జేబట్టి యిటయితిగదా' యని ద్రౌపది మితిలేని దుఃఖముచేతఁ బరితపించును. మనలఁజూచి మనవైభవమును జూచి మిత్రులు సంతోషించి నట్లు శత్రువులు దుఃఖపడినఁగదా, మనసంపదలకుఁ దగినఫలము గల్గును. కావున మన మట్లు చేయుద" మని కర్ణుఁడు చెప్పఁగా విని, 'అవును. నీ వనినమాట మిక్కిలి బాగుగ నున్నది. నేనును నట్లుసేయ నెంచు చుంటిని గాని, ముసలివాఁడగు ధృతరాష్ట్రుఁడు మనలఁ బోనిచ్చునా? పాండవులతోడి యుద్ధమునకుఁ బోవు చున్నామని తలఁచి మనల నాపివేఁయడా?' అని దుర్యోధనుఁడనెను. ఆమాటలు విని 'అట్లుకాదు, మనయావులు ద్వైతవనములో నుండుట ధృతరాష్ట్రునకుఁ దెలియును. అడవి మృగములచట గోవులను బ్రతుకనిచ్చుట లేదనియు, వానింజంపుటకై వేఁటాడ వలయుననియు యుక్తి పన్నుదము. తప్పక మీతండ్రి యిందున కంగీకరించును, అని శకునిచెప్ప, నట్లే యని మఱునాఁడు ధృతరాష్ట్రునియొద్ద సెలవుతీసికొని, తన పరివారము వెంట నడిచిరాఁగా, దుర్యోధనుఁడు తమ్ములతోను భార్యలతోను, మిక్కిలి వైభవంబుతో ద్వైతవనంబుఁజేరి, యచట గోగణంబులఁజూచి యానందించు చుండెను. ఒక్కనాఁడు ద్వైతవనసరోవరమునకు వెళ్లి, యచట, ధర్మరాజు యజ్ఞదీక్షగైకొని యుండుటఁజూచి వారల నుడికింప నుద్దేశించి, తన

స్త్రీలతో జలక్రీడ లాడునెపమున, డేరాలువేయింపఁ జారులను బంపెను. వా రచ్చటఁ బని సేయుచుండ గంధర్వ భటులది కూడదని చెప్పిరి; కాని దుర్యోధనుని తమ్ములు యుద్ధమునకు వచ్చుటచేత గంధర్వులు వారలతోఁ బోరాడి వారిని దఱిమివేసిరి. ఈసంగతి నంతయు వినిన దుర్యోధనుఁడు కర్ణసమేతుఁడై వచ్చి గంధర్వులతో యుద్ధముచేసెను. కర్ణుఁడు పాఱిపోయెను. దుర్యోధనుఁడు పట్టుపడెను. వానిని బంధించిరి. దుర్యోధనుని భార్యలను దమ్ములను మంత్రులను చిత్రసేనుఁడు చెఱవట్టి గంధర్వలోకమునకుఁ దీసికొని పోవుచుండెను.

ఇంతలోఁ బాఱిపోయిన కురుసైన్యము ధర్మరాజును సమీపించి జరిగినదంతయుఁ జెప్పి రక్షింపుమని ప్రార్థింపగా దుర్యోధనునియొగ్గులను బరిగణింపక, వారలను విడిపించుకొని రండని తమ్ములతోఁజెప్పెను. దీనస్థితియందుండి కష్టములఁ గుడుచుచుండు మనల వెక్కిరింపవచ్చిననీచుఁడగు దుర్యోధనునకుఁ దగినశాస్తి యైనది. మనమెందునకు వానికిఁ దోడు పడవలయును?

ఉ॥ విపరీతస్థితి నొంది ఘోర విపినోర్వీవాసులై నిత్య దుః
ఖపరాధీనతఁ దూలి రంచు మనలన్ గర్వాంధితస్వాంతుఁడై
యపలాపింపఁగ వచ్చి, దుర్ణయపరుం డా ధార్తరాష్ట్రుండు దో
షపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁడై?

అని భీముఁ డనినను ధర్మరా జామాట కొప్పుకొనకుండుటచేత భీమార్జునులు యుద్ధముచేసి గంధర్వరాజును దుర్యోధనాదులను ధర్మరాజు నొద్దకుఁ దెచ్చిరి. ధర్మరాజు

దుర్యోధనునికట్లు విడిపించి మంచిమాట లాడి పంపివేసెను. ఘోషయాత్రాఫల మప్పుడే దుర్యోధనాదు లనుభవించిరి.

పాండవులు ద్వైతవనంబునఁ గొన్నినాళ్లుండియందలిమృగములు ధర్మజుని బ్రార్థింపగా దానిని విడిచి కామ్యకవనంబునఁ దృణబిందునియాశ్రమంబున నివసించియుండిరి. ఒకనాఁడు తమ పురోహితుఁడగు ధౌమ్యుని ద్రౌపదికిఁదోడుగానుంచి పాండవులయిదుగురు వేఁటకు వెళ్లిరి. ఇంతలో సింధుదేశ రాజగు సైంధవుఁడు, సాల్వదేశరాజుకూఁతును బెండ్లియాడుటకుఁ దనపరివారమును దీసికొని మిక్కిలి వైభవముతోఁ బోవుచుండి యాశ్రమముయొక్క తలుపునొద్ద నిలిచి యుండిన ద్రౌపదిని జూచి మోహించి, యామె నెట్లయినను దీసికొని పోవలయునని నిశ్చయించి, యా యాశ్రమముఁజొచ్చి, బలవంతముగా ద్రౌపదిని దనరథముమీఁదఁ బెట్టుకొని, సేనాసహితుఁడై పోవుచుండెను. వెంట ధౌమ్యుఁడు కేకలువేయుచుఁ బరుగిడుచుండెను. ఇంతలో ధర్మరాజాదులు, కావలసినన్ని మృగములను జంపి, యింటికి వచ్చుసమయమున, దుశ్శకునముల నెన్నిఁటినోచూచి భయపడి, మిక్కిలి తొందరగా నాశ్రమమునకు వచ్చి, జరిగినసంగతి నంతయును నక్కడి వారల వలనఁ దెలిసికొని, సైంధవుని వెంట నంటి పోయిరి. త్వరలో వాని నెదుర్కొని యుద్ధముచేసిరి. సైంధవుఁడు ద్రౌపదిని వదలి పాఱిపోయెను. ధర్మరాజు ద్రౌపదిని వెంటఁ బెట్టుకొని యాశ్రమమునకు వచ్చెను. భీమార్జునులు సైంధవుని వెంట నంటి పరుగెత్తి, వాని నొకచోటఁ బట్టుకొని, చావకుండ మెత్తగా నలియఁగొట్టి, మూటగట్టి ధర్మరాజునొద్ద పడవైచిరి.

భీముఁడా దురాత్ముని జంపెద ననెను. కాని, తమ చెల్లెలగు దుస్సలయొక్క భర్తయని ధర్మరాజందుల కియ్యకొన మిచేఁదల గొఱిగించి, పాండవ దాసుఁడ ననిపించి, వానిని వదలివేసిరి. కోపముగల యాసైంధవుఁ డంతట శివునిగూర్చి ఘోరముగఁ దపస్సుచేసి, ధర్మజుభీమనకుల సహదేవుల నొక దినము యుద్ధమున జయింపఁ గల్గునట్లు వరము పొంది, తన రాజ్యమునకుఁ బోయెను,

13. పాండవులు మాఱువేసంబున విరటుఁగొల్చుట

పాండవుల యరణ్యవాసము పండ్రెండు సంవత్సరములు పూర్తిగావచ్చెను. వారీ కాలమునఁ గొంత కష్టపడినను మొత్తముమీఁద సులభముగా దానిని గడపి రనియే చెప్ప వచ్చును. మఱియొక యేఁ డజ్ఞాతవాసము మిగిలియుండెను. అరణ్యవాసముకంటె నిది కష్టతరము. ఎందున కనఁగా నజ్ఞాత వాసమునందుఁ బాండవు లెవరిచేతను గుర్తింపఁబడఁగూడదు. అట్లు గుర్తింపఁబడిరేని వారు మరలఁ బండ్రెండు సంవత్సరము లరణ్యవాసము చేయవలసి వచ్చును. కావున నెవ్వరికినిఁ దెలియకుండ నెట్లు మెలఁగవలయునా యని వారందఱు యోజనచేసి, కడపట విరాటరాజునొద్ద సేవావృత్తి నుండుదమని నిశ్చయము చేసికొనిరి. ధర్మరాజు బ్రాహ్మణవేషము వేసికొని కంకుఁడను పేరుతో విరాటరాజునొద్దఁ జేరెను.

భీముడు వంటలవాఁడగుటకు నిశ్చయించుకొని వీఁపుమీఁద నొక పెద్దగరిటె వ్రేలాడుచుండ బెడిదంపుఁగోలలఁ గుడిచేతఁబట్టుకొని, మత్తగజముమాడ్కిఁ బ్రజ లాశ్చర్యపడు

చుండ వీధుల నడుచుచుఁ గొలువుకూటంబున నున్న విరాట రాజునొద్ద కేతెంచుచుండెను. విరటుఁ డాతని యున్నతభుజము లను విశాలవక్షమును దేదీప్యమానముగఁ బ్రకాశించు ముఖ వర్చస్సును వీక్షించి పరవశత్వము నొంది కొంత దెలివొంది "ఆహా! ఈ మహానుభావుఁ డెవఁడై యుండనోపు? మనుజ రూపము దాల్చి భూతలమున విహరింప నేతెంచిన పద్మబాంధవుఁడా లేక శచీధవుఁడా! ఈతని నెఱుఁగుదుమని చెప్పఁగల వారెవ్వరైన నిచటనుందురా" యని యోజించుచుండ పవన తనయుండు సమీపించి మనుజేంద్రునకు వినయంబున మ్రొక్కి "మహారాజా! నే నాలవజాతి వాఁడను. మీయొద్ద సేవా వృత్తి నుండవచ్చితి. మీచిత్తము వచ్చినట్లు వంటచేయఁగల వాఁడను. వంటయందు నన్ను మించినవారీయూరనేగాక మఱి యే యూరియందును లేరని చెప్పనగును."

శా. దేవా ! నాలవజాతివాఁడ, నిన్ను నర్థిం గొల్వఁగా వచ్చితిన్,
సేవాదక్షత యొందుమై నెఱుఁగ నీచిత్తంబునన్ మెచ్చున
ట్లే వండం గడునేర్తు, శాసనమునం దిచ్చోట నే కాదు, న
న్నేవీటన్ మిగులంగ నెవ్వఁడును లే డెళ్ళంగులం జూచినన్.

మహాప్రభూ! నాపేరు వలలుఁడు. కోరిన వంటకములు నిండి భక్తితో మిమ్ముఁ గొలిచెదను. నాకన్న వస్త్రముల నిచ్చి పోషించిన నంతియ చాలును.

మత్స్య—ఓయీ! నీవు శూద్రుఁడ వని నేనెట్లు తలంతును? శూద్రున కిట్టి దివ్యరూప మెక్కడనైన నుండునా? నీవు గొప్పవంశమువాఁడ వనియె తోఁచుచున్నది. కావున

నీవు నాగజములఁ బరికించు నధికారివై సేవకులచేత బనులు సేయింపు చుండుము.

భీమ—మహారాజా! నాకది యెందులకు? రాజులకుఁ దగినవంట చేయువాఁడను గాని నే నేయధికారమును బూనఁ జాలను. వంట చేయుటయందు గట్టివాఁడ నని తలంచు చుండిన యా ధర్మరాజును గొలిచినట్లు మిమ్ముఁ గొల్వ వచ్చితిని గాని మఱియొకటి కాదు.

ఉ. నా కవి యెల్ల నేల? నరనాథులకుం బ్రియ మెందునట్లు గాఁ
బాకము సేయ నేర్తు, జనపాలక! ధర్మసుతుండు పెద్దయుం
జేకొనియుండు బానసము సేయువిధంబున కిచ్చ మెచ్చి, పు
ణ్యాకరమూర్తివైన నిను నాతనిఁ గొల్చినయట్లు గొల్చెదన్.

మీ రిష్టపడితి రేని మీయొద్ద వంటలవాఁడనై యుండె దను. బలము గలవాఁడ నగుటఁ జేసి నే నేమృగముతో నైనను యుద్ధముఁ జేసి నా బలశౌర్యములఁ జూపెదను. మల్ల యుద్ధమున నే జెట్టినైనను గెలిచి మీ మెప్పు వడసెదను.

చ. వలసిన నేలు! మేను బలవంతుఁడ గా నెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథు నిం దొడరి పోరుదు శూరత యుల్లసిల్లఁ గా
దలమున లావు విద్య మెయిదర్పముఁ జేర్చి పెనంగు జెట్టిమ
ల్లుల విఱుతున్ వడిన్ గడియలోనన చూడ్కికి వేడ్క సేయుదున్.

మత్స్య—(కొంతసేపూరకుండును).

భీమ—మహాప్రభూ! కొలువుఁగొన నిష్టము లేదేని నన్నుఁ బొమ్మనుఁడు. నావలసినచోటికే నేగెదను.

మత్స్య—ఓయీ! దివ్యమూర్తివగు నీకీ నీచవృత్తి గల్పించుటయా యని యోజించి నీకుఁ దగినపనిని జెప్పితిమి కాని ని న్నొల్లక కాదు. నీయిష్టప్రకారము మాకడ నంటల వాఁడవయి యుండుము. నీ వెటులైనను మాయొద్దనుండుటయె మాకిష్టము.

ఉ. ఇమ్మహనీయరూపమును నేడ్తెఱఁ గన్గొని వేడ్క నీకు యో
గ్యమ్ముగు భంగిఁ జెప్పితిమిగాని, నరోత్తమ! యొండుగాదు, నీ
వెమ్మెయినైన నిల్చుటయు యిష్టము, వంటలు మేరవాఁడవై
యిమ్ములనుండు, మాపజన మెల్లను నీదగు పెంపు సేయఁగన్.

అని విరాటరాజు చెప్పుట విని పరమానందభరితుఁడై మొగమునఁ జిఱునగవు జేపురింపఁ వేగమున వంటసాలకు వెళ్లి యచటిపనివారలఁ జేరఁబిలిచి రాజునకుఁ బ్రియమగు వంటకంబులఁ దెలిసికొని, వానిఁజేయుటకాపూఁటయే మొదలుపెట్టెను.

అర్జునుఁడు పేడిమూఁతిఁ దాల్చి విరాట రాజు కూఁతురగు నుత్తరకు నాట్యము చెప్పుచుండెను. నకులుఁడు దామగ్రంథి యను పేరున నశ్వశాలాధికారియయి పనిచేయుచుండెను. సహదేవుఁడు తంత్రీపాలుం డను పేర గోపాలకుఁ డయ్యెను. ద్రౌపది విరాటరాజుభార్య యగు సుధేష్ణయొద్ద సైరంధ్రియయి యూడిగము చేయుచుండెను. ఇట్లు నిర్వక్ర పరాక్రములగు రాజపుత్రు లయ్యును, విధివశమున సేవా వృత్తి కొగ్గవలసినపుడు తమ పూర్వవైభవమును గాసి, రానున్న పదివిసిగాని, తలంపక సేవావృత్తికిఁ దగినట్టు లణఁగి మణఁగియుండిరి. ఇంతేకాక లక్ష్మీపుత్రులయ్యును నొక్కొక్క

రొకొ్కక వృత్తియందు, అరి తేరిన వారయి యుండుటఁ గష్ట కాలమునందు వారి కెంతయో తోడుపడినది.

పాండవులు ఇట్లు మాఱువేషంబులతో విరాటరాజు పురమునఁ గొంతకాలము గడిపిరి. ఇట్లుండ నొకనాఁడొక మల్లుఁడువచ్చి భుజము లప్పళించి, విరాటరాజునకు నమస్కరించి నిలువంబడి "మహారాజా! నేనెందఱనో జయించి వచ్చినాఁడ. మీయొద్ద నెవ్వరైన నున్నయెడల వానితో మల్లయుద్ధము (కుస్తి) చేసెద"నని నుడివెను. రాజసమ్ముఖమున నున్న మల్లులు వానింజూచి భయపడి మాటాడక నిలుచుండిరి. ధర్మరా జంతట "మన వంటలవాఁడు మల్లయుద్ధము చేయు"నని చెప్పఁగా భీముని బిలిపించిరి. భీముఁడు రాజునకు నమస్కరించి మల్లయుద్ధమునం దాజెట్టిని గెలిచెను.

## 14. కీచకుని వధ.

ఒకనాఁడు రాజుగారి బావమఱఁది యగు కీచకుఁడు తన చెల్లెలగు సుధేష్ణతో మాటలాడుటకై, యామెనగరునకు వెళ్ళి, యచటఁజాటున నిలిచియుండు సైరంధ్రినిఁజూచి యామెను బెండ్లి జేసికొనవలయునని సుధేష్ణతోఁ బలుమార్లు చెప్పి, ఆమె వలదని యెంతచెప్పినను వినక మొండిపట్టు పట్టి యామెను బాధింపుచుండెను. ఒకనాఁడు సుధేష్ణ కల్లుదెమ్మని యొక పాత్రనిచ్చి ద్రౌపదిని కీచకుని యింటికి పంపెను. ద్రౌపది దానిని చేతఁబట్టుకొని, దుర్మార్గుఁడైన కీచకుని బారినుండి తన్నుఁగాపాడుమని యపుడుదయించు సూర్యుని వేఁడుకొనఁగా నొక రాక్షసుఁడామెకుఁదోడై యితరుల కగపడకుండ నామె వెంట వెళ్లుచుండెను. ఇంతలోఁ గీచకుని మందిరము సమీప

మాయెను. ద్రౌపది వచ్చి తెలియక కీచకుఁడు దువ్విళ్లూరుచు మతి తప్పి మోహముచే మత్తెక్కి పిచ్చి పిచ్చి మాటలాడుచు నామెను బట్టఁబోయెను. అబల యైనయామె రాక్షసుని ప్రభావముచేత బలముగలదై, కీచకుని దూరమునకు నెంటి వైచి, వానినుండి తప్పించుకొని వీధిలోనికిఁ బాఱిపోయెను; గాని పట్టపగ లనియు నితరులు చూచిన నవ్వుదు రనియు దలంపక, కీచకుఁ డామెను దఱుముకొనుచుఁ బరుగెత్తెను. ద్రౌపది విరాటరాజు సభాభవనమునకుఁ బరుగిడెను. కాని కీచకుడు నిర్భయముగా వెళ్ళి యామెనచటఁ బట్టుకొని నేలఁ బడఁ దన్నెను. ద్రౌపది మిక్కిలి దీనముగా నంగలార్చెను. విరాటరాజు జరిగినదంతయును జూచి శావమఁ అది నేమియు ననఁజాల కుండెను. భీముఁడు రౌద్రాకారుఁడై చెట్టువెపుజూచు చుండుట ధర్మరాజు కనిపెట్టి, ఇది సమయముకాదని తెలియఁ జేసెను.

వంటసేయు విషయమున భీమునివంటివా రుండరు. ఇతఁడు వంటఁ బ్రారంభించుటకుఁ బూర్వము వంటయింటిని శుభ్రముగఁ గడిగించి, కావలసిన సామగ్రినంతను జాగ్రత్త చేయించి, పిదపఁ దాను శుభ్రముగ స్నానముఁ జేసి యారిన బట్టను ధరించి, యొక్క చిన్న యంగవస్త్రమును మీఁద వేసికొని గాడిపొయ్యియందు నిప్పు వేయించును. ఆ నిప్పు రగులుకొని మంటమండు నప్పటికి గుండిగలను దోలచి వాని నిండ నీరు నింపి పొయ్యిమీఁదఁ బెట్టి నీరు మరగులోపల బియ్యము కడిగి వేయును. పప్పుడుకుచుండఁగనె కూరగాయలు తానె తఱిగివేసి, ఇతరులసాయము లేకయే పచ్చళ్ళను సిద్ధ

పఱచును. వంటగుండిగ లెంతపెద్ద వయినను నెడమచేత దించి వేయును. ఎంతమంది కయినను నొకగంటలో మిక్కిలి శుచిగను రుచిగను వంటసేయఁగలఁడు. అందుచేత భీమునివంట యనినఁ బ్రజలకు నోరూరుచుండెడిది. నాలుక చెడిన రోగులెందఱో వంటసాలయొద్ద చారుపోయు మనియుఁ బచ్చడి పెట్టుమనియుఁ బ్రతిదినము కాచుకొని యుండెడువారు. ఇట్టిభీముఁడానాఁటిరాత్రి యెప్పటియట్ల వంటఁజేసి, యందఱు భోజనము చేసి వెళ్లిన తరువాత వంటశాలను శుభ్రముచేయించి తన యంగవస్త్రమును పఱచుకొని, పీఁట నొకదానిని దిండుగా నుంచుకొని పరుండి యుండెను. ద్రౌపది వంటసాలఁజేరి యాతనితోఁ దాను పడినయవమాన కారణముల నన్నింటిని జెప్పెను. 'ధర్మరాజు వారింపకుండిన యెపల కీచకు నక్కడనే చావఁ గొట్టియుందు' నని చెప్పి మఱు నాఁడు రాత్రి కీచకునొంటరిగా నర్తనశాలకు రమ్మని చెప్పుమని యుపాయముఁ జెప్పెను.

ద్రౌపది యట్ల యని సుధేష్ణమందిరమునకుఁ బోయి యుండ సింహబలుఁడు సింగారించుకొని వచ్చెను. పాంచాలి వానితోఁదగిన సంభాషణంబు సేసి నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁ జెప్పి, ఒక్కరుండ వచ్చువాఁడ వని నియమించి పంపిన, నాదురాత్ముండు ప్రముదాదిత్ముండయి చనియెను. మఱునాఁడు ద్రౌపది యా యుదంతంబంతయు వంటసాలనున్న భీమున కెఱింగించి, "నాకొఱఁతఁదీర్చి వచ్చితి నికఁ నీకొఱఁత మిగిలియున్న" దని సాభిప్రాయముగాఁ బలికెను.

క॥ నాకొఱఁతఁ దీర్చివచ్చితి, నీకొఱఁతయయింక మాతునికి దెగజూడక
లోకము వంచింపను దగుచీఁకటివే యెదవెనేమి సేసెదొ చెపుమా!

భీముఁడంతట ద్రౌపదికిని గీచకునకును జరిగినసంభాషణమునంతను విని క్రోధం బతిశయింప వానింజంప నువ్విళ్ళూరుచుఁ గొంత యోజించి, కీచకుఁడు భయఁపడక సంకేతస్థలంబునకు వచ్చునా? వచ్చిన నొంటరిగ రాక వెంట నెవరినైనను దెచ్చునా? మతిదప్పి యుండుటచేత నీగుట్టు బయట వేయునా?

క॥ వెఱవక సంకేతించిన తెఱఁగుననయ్యెడకు నరుఁగుదెంచునొకో? కొం
దఱఁదెచ్చునొకో వెడగై యఱిముఱి వెలిపుచ్చునొకో రహస్యంబెల్లన్.

అని సంశయపడుచు సింహబలుని సంభాషణమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని వాఁడట్లేలచేయును? నీమాటలకు సంతసమంది వెళ్ళెనుగదా! అట్టివాని కెక్కడ శంక జనింపఁగలదు?

ఉ॥ అట్టిదియేలచేయు? వినయంబనయంబొడఁ గూడఁ బల్కునీ
విట్టితెఱంగు సేయుమని యేర్పడఁ జెప్పిన, వానికత్తఱిం
బుట్టినసంతసంబు నను వుంబరికించితి గాదె? యింకని
ట్టట్టనఁ డెట్టులైన, హృదయంబున నెక్కడి శంకవానికిన్?

కావున నాట్యశాల కొంటరిగా నతఁడు తప్పక వచ్చి నన్ను వెదకి నాతో యుద్ధముచేసి నీకుఁ బ్రీతిగాఁజచ్చు. సందేహింపక విచార ముడుగుము.

ఉ॥ వచ్చు మదాంధ వృత్తి, ననివారణ నొక్కఁడు నాట్యశాలకుం
జొచ్చు, ననశ్యమున్ వెదకి చూచి ననుం గని యుద్ధ సంగరం
బిచ్చు, మదీయ బాహుబల హీనబలుండయి నీకుఁ బ్రీతిగాఁ
జచ్చు, నసంశయం బిది విచారము లన్నియు నింక నేటికిన్,

అనుచుఁ గీచకుని జిత్రవధ గావించెద నని భీముఁడు చెప్పెను. కాని భీముని క్రోధంబువలనఁ దమ గుట్టు బయల్పడునేమోయని పాంచాలి సంచలిత స్వాంతయై భీమసేనుని కిట్లనియె "నాథా! మన గుట్టుబయలయ్యెనేని ధర్మసుతుండు విచార పడును. మన వైరులు నవ్వుదురు, మనయభిమతంబొడఁగూడియు నిష్ఫల మగును.

ఉ॥ ఒవ్వనినాగునవ్వ, మహిమోదధి ధర్మసుతుండు దీనికి
న్నొవ్వఁగఁబొంద, భూజనులు నింద యొనర్పఁగ, నేనొనర్చు నీ
చివ్వకు నీవు నల్క మెయిఁ జేసిన యీపని గూఢవృత్తికిన్
దవ్వగు నేని యియ్యభిమతంబొడఁగూడియు నిష్ఫలంబగున్.

కావున మనరహస్యము బయల్పడకుండునట్లు వంచనచే మనరిపుం బరిమార్పంగ సాధ్యమగునేని యట్లుచేయుఁడు లేనియెడల యూరకుండుట నాయభియతంబు" అని పాంచాలి పలుకుట విని 'కీచకాధముఁడు నాయెదుటఁ బడినపుడు రహస్యమనియు కాదనియు వివేచనాబుద్ధి నాకు కల్గునని దలంపను. అయినను సాధ్యమగు నంతవఱకు రహస్యముగ వానిం బరిమార్పఁ జూచెదను.

చ॥ మనమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని నిల్చినవీఁకమై మయిం
గదిసితి మేని,నప్పుడు ప్రకాశ రహస్య విభేదబుద్ధి నా
కొదవునె? యైన నేఁదలఁచి యోపినభంగి నిగూఢవృత్తిమైఁ
బదిలము గల్గితిన్నని యుపాయమునం దెగఁజూచు నాతనిన్.

అని భీముఁడు ప్రత్యుత్తరమియ్య 'జయలక్ష్మిం జేకొనుఁ'డని దీవించి పాంచాలి సుధేష్ణ మందిరమునకుఁ బోయెను.

భీముఁడు వంటపనులు త్వరగా జరుపుకొని, నర్తనశాలలో నొకమూల నొదిగి పరుండియుండెను. కీచకుఁడు సింగారించుకొని వస్త్రాభరణములను దీసికొని హాయలుగా నర్తనశాల లోనికి వచ్చి, అచట ముసుఁగిడి పరుండియున్నది సైరంధ్రియే యని, మిక్కిలి మక్కువతో వెళ్ళి, తానుదెచ్చిన వస్తువులఁ దీసికొనుమని నిద్రలేపెను.

చ. వనిత మనోహరంబులగు వస్తువులెల్లను వేడ్కనేతి నీ
కని నియమించి తెచ్చితిఁ బ్రియంబున గైకొను, మెప్డు నంగనా
జనములు నన్నుఁ మరుసాయకముల్ చమ చిత్తవృత్తులే
చినఁ గొనివచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్.

ముసుంగిడి పరుండియున్న భీముండు లేచి కీచకుని చిత్రవధ గావించెను. భీముఁడు కీచకుని నర్తనశాలయందు నలియఁగొట్టి ముద్దచేసి యొకమూలఁ బడవైచి వెలుపలికేతెంచి యచట నుండు ద్రౌపదిని నర్తనశాలకుం దోడుకొని పోయి మంట వెలుఁగున మూలఁబడియుండు శవమును రహస్యముగఁ జూపి "ఇదిగో! నాకొఱఁతయుఁ దీర్చితిని. నీయవమానమును మాన్పితిని. దురుద్దేశమున నీచెంతఁజేరువారలెవరైనను నాచేతఁబడి బ్రతికిపోఁగలరా.

శా. చింతాశల్యము వాసెనే? భుజబలోత్సేకంబు నీకెక్కెనే?
శాంతింబొందెనె రోషపావకుఁడు? దుశ్చారిత్రునింజూచితే?
సంతోషించెతె? యిట్లుగాక బ్రతుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చెంతం జేరిన యట్టి వీరులకు నాచేతన్? బయోజాననా!

ఇఁక విచారపడకుము" అని యూరడించి యేమియు నెఱుఁగనివానివలె వంటసాలఁజేరెను.

కీచకుఁడు గంధర్వులచేఁ జంపఁబడె ననువార్త మఱునాఁడు పట్టణము నందంతట నల్లుకొనెను. జనులు గుంపులు గుంపులుగా వచ్చి ముద్దగాఁ బడియుండు కీచకుని శవమునుఁ జూచి యాశ్చర్యపడి 'పరస్త్రీలను గామించిన యీ పొగరుబోతునకు శాస్తి యయిన'దని యనుకొనుచుఁ బోయిరి.

ఉపకీచకు లచటఁ జేరి యన్నకై విలపించు చుండిరి. ఏమి జరుగునో చూతమని ద్రౌపది యావైపునకుఁ బోయెను. ఉపకీచకు లామెనుజూచి 'ఈ పాపి వలనఁగదా మాయన్నకుఁ జావుమూడినది. దీనిని పీనుఁగున కంటఁగట్టి కాల్చి వేయుదము' అనుచు ద్రౌపదిని బలవంతముగాఁ బట్టుకొని శవమున కంటఁగట్టిరి.

ఉ. "అంగజరాగమత్తుఁడగు నన్నకు నిమ్మెయినయినఁ బ్రీతి సే
యంగల వార మీ జరభి యాతనితోడన తీఱుఁగాక" యం
చుం గొనిపోయి దైన్యమున సూతుని పీనుఁగుమీఁదఁ బాండుపు
త్రాంగనఁ బెట్టికట్టిరి దయాపరివర్జిత చిత్తవృత్తులై.

అశుచియు దుర్మార్గుఁడును నగు కీచకునిశవమునకు నిత్యశుచియుఁ బుణ్యశీలయు నగు ద్రౌపదిని గట్టుటఁజూచి జనులందఱు విచార పడుచుండిరి.

ఉ. అశుచియుఁ గష్టుఁడున్ లఘువునైన నిజాగ్రజు మేనితోడ ని
త్యశుచియుఁ బుణ్యశీలయు నుదాత్తయు నాజనుఁ నింతిఁ గొంచుక
ర్కశమతిఁ గీచకుల్ బహుముఖంబుల బాంధవవిప్రలాపముల్
దిశలద్రువం జెలంగఁ గరదీప నికాయము ప్రజ్వరిల్లగన్.

ద్రౌపది తన నాథులను దలఁచుకొని గోలు గోలు మని పలవరింప నాగెను.

తే. నాథులార! గంధర్వరత్నంబులార! నన్ను నుపకీచకులు దమయన్న శవము
నందు బంధించుకొని వెస నరుగుచున్న వారురక్షింప వేగరావలయుమీరు.

ఉపకీచకు లా యార్త రవమును సరకు చేయక తమ యన్నతోడ నామెను గూడ శ్మశాన వాటికకుఁ దీసికొని పోవుచుండిరి.

ఈసంగతి వంటయింట నుండు భీమునకుఁ దెలిసెను. తోడనే యాతఁడు బయలుదేఱి శ్మశానప్రదేశమున నుండు చెట్టు నొకదానిని బెల్లగించి దానిని ద్రిప్పుచు నుపకీచకులకై వేచి యుండెను. ఉపకీకులు హాహారవములు సేయుచుఁ దమ పరాక్రమముల నుగ్గడించుకొనుచు "గంధర్వులా! ఇపుడు రా వలసినది! నిన్నుఁ దగులఁ బెట్టినతర్వాత గంధర్వులు వత్తురు తే "యనికొందఱును 'ఇఁక చింతింపకు. నీకై ప్రాణములఁగోలు పోయిన నీ పతితో నీకు సహగమన పుణ్యమబ్బిన' దని కొంద ఱును ద్రౌపదిని పరిహాసము చేయుచుఁ బోయి, శ్మశానవాటి కలో రౌద్రాకారముఁ దాల్చి చెట్టును జేతఁ ద్రిప్పుచున్న యా భీముం గాంచి గంధర్వుఁడతఁడేయని భయపడి తమయున్న శవము నచటఁ బడవైచి కొందఱు పల్లములందు దాఁగిరి. కొందఱు మహీజంబు లెక్కిరి, కొందఱు పిక్కబలముఁ జూప మొదలిడిరి. కొందఱు కాళ్ళాడక నేలఁబడిరి.

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింకెట్లోక్క యంచుఁ భయం
బొదవం బల్లములందు డాగియుఁ సమీ పోర్వీజముల్ ప్రాఁకియుఁ
జెదరం బాఱియుఁ నీరు సొచ్చియును నిశ్చేష్టుఁ బద ద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియుఁ భరితసంక్షోభాత్ము లైరత్తఱిఁ




భీముఁడు ఉపకీచకులను చంపుట.

ఇట్లు భీతాత్ములై పరుగిడునుపకీచకులఁ దఱిమి తఱిమి తనచేతుల తీఁటబోవునట్టు చావ మోది పేరునకైనను కీచకుని లేకుండ జేసెను.

ఉ. సూతులు భీతులై ద్రుపదసూతి సమేతముగాఁగ నగ్రజ
ప్రేతము నైచి, వీటికిసఁ బెల్లుగఁబాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని వారిబడల్పడ ద్రేసియందఱం
జేతుల తీఁట వో నుఱుముసేసె విశృంఖల విక్రమంబునన్.

పిమ్మట భీముఁడు చేతనున్న చెట్టును బాఱవేసి త్రాళ్లు విప్పి, ద్రౌపదిని వదలించి తా నెప్పటివలె వంటసాలకు నెళ్లెను. ఈవార్త పురినంతటను దెలిసెను. గంధర్వుఁ డెవఁడో వచ్చి చెట్టునే పెల్లగించి యుపకీచకులను హత మొనర్చెనని యందఱు చెప్పుకొనుచు వచ్చిరి. అప్పటినుండియు సైరంధ్రి యన జనులు భయపడు చుండిరి. ఆమె దారిలోఁ గనఁబడె నేని జనులు దూరమునకుఁ దొలఁగి పోవుచుండిరి.

---

## 14. యుద్ధము.

అజ్ఞాతవాస మయినతరువాతఁ బాండవులు విరాట దేశమున నుండిరి. తమకు రావలసిన రాష్ట్రార్ధభాగము పంచి యిండని ధృతరాష్ట్రునకు సందేశమంపిరి. కాని భాగమియ్యఁ గూడదని దుర్యోధనాదులు పట్టుఁబట్టుటచేత ధృతరాష్ట్రుఁ డేమియుఁ జేయఁజాలక పోయెను. పాండవులు యుద్ధమునకు దిగి తగు ప్రయత్నములుచేసిరి. కౌరవులుకూడఁ బ్రయత్న

ములు చేసిరి. రెండుపక్షములవారు కురుక్షేత్రము నొద్ద పదునెనిమిది దినములు ఘోరయుద్ధము చేసిరి.

భీముఁడు కర్ణుని కొడుకు అగు సత్యసేనుని జంపెను. క్రోధముచేతఁ గర్ణుఁడు ధర్మరాజును బాణములచేత నొప్పించి యవమానపు మాట లాడెను. భీముఁడు కోపించి కర్ణునితో యుద్ధముచేసి వానిని మూర్ఛవడఁ గొట్టి, ధర్మరాజు నవమానపు మాటలాడినందున కాతని నాలుకఁ గోయుట కుద్యుక్తుఁడయ్యెను, కాని శల్యుఁడతని వారించెను. పిమ్మట భీముఁడు దుశ్శాసనుని యుద్ధరంగమున నెదుర్కొని వానిని నేలఁబడఁ గొట్టి తన ప్రతిజ్ఞాప్రకారమాతని గుండెకాయఁజీల్చి రాక్షసుని వలె రక్తముఁద్రావి రక్తమునంతయును నొంటికిఁ బూసికొనెను. అనంతర మాతఁడు ద్వైపాయన హ్రదంబునఁ దాఁగియున్న దుర్యోధనునితో గదాయుద్ధముచేసి, గదచేత నాతని తొడలు విఱుగనేసి యీ వెచ్చని నెత్తుటిచేత ద్రౌపదికురులు చిక్కుడలించి తనప్రతిజ్ఞ నెఱవేర్చుకొనెను.



